44032

# అపరోక్షానుభూతి

శ్రీశంకరాచార్య విరచితము

శ్రీ శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రిచే
ముత్యాలసర చ్ఛందోబద్ధాంధ్రానువాదము
తాత్పర్యసహితము

డా. ఏల్చూరి మురళీధరరావు, M.A., Ph.D.
రీడర్, ఢిల్లీ విశ్వవిద్యాలయం గారిచే పరిష్కృతము

ఈ పుస్తక ప్రచురణకు



శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు
"ధార్మిక పుస్తక ప్రచురణ సహాయ ప్రణాళిక" క్రింద రూ. **8000/-**
ప్రదానం చేసిరి. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు
This Book is published with the financial assistance of
**Sri Sri Sri Thirumala Thirupathi Devasthanam** under the
Scheme **"Aid to Publish Religious Books"**

శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రి
8A/83, W.E.A., కరోల్‌బాగ్, న్యూఢిల్లీ - 110 005.

ముద్రణ : కలిశకం 5100, శాలివాహన శకం 1921,
ప్రమాదినామ సంవత్సర మార్గశీర్షము (1999 డిసెంబరు)

ప్రతులు : 1000

మూల్యం : రూ. 35/- లు

ప్రతులకు : **S.L. Sastry,**
8A/83, W.E.A.,
Karol Bagh,
New Delhi - 110 005.

శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రి,
B-1-67, రవీంద్రనగర్,
గుంటూరు - 522 006.

ముద్రణ : పద్మశ్రీ గ్రాఫిక్స్
1-1-770/5, గాంధీ నగర్,
హైదరాబాదు.
ఫోన్ : 761 22 83

# श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्
# दक्षिणाम्नाय श्री शारदापीठम् शृङ्गेरी

**PRIVATE SECRETARY**
To His Holiness
Sri Jagadguru Shankaracharya
Dakshinamnaya
Sri Sharada Peetham
SRINGERI - 577 139 (Karnataka)

Camp : శృంగేరి
Ref. : D7/3781
Date : 30-12-99

*శ్రీ శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రిగారికి*

నమస్కారములు,

మీరు శ్రీచరణుల సన్నిధిన సమర్పించిన 'అపరోక్షానుభూతి' ముత్యాలసర చ్ఛందోబద్ధాంధ్రానువాదము - తాత్పర్య సహితము - అను గ్రంథమును శ్రీ చరణులు అవలోకించినారు. మీ అనువాదము హృద్యముగానున్నదని శ్రీచరణులు సెలవిచ్చినారు.

శ్రీ శారదాచంద్రమౌళీశ్వరుల అనుగ్రహము వలన మీకు సకల శ్రేయస్సులు లభించుగాక యని శ్రీ చరణులు ఆశీర్వదించి అనుగ్రహించిన ఆశీర్మంత్రాక్షలు శ్రీ శారదాచంద్రమౌళీశ్వరుల ప్రసాదము పంపుచున్నాను.

ఇట్లు
Sd/-
**తంగిరాల దక్షిణామూర్తి**
P.S to శ్రీమత్ పరమహంస పరివ్రాజక జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ స్వామి

EC :
ప్రసాదము

---

*అడుగగనె ఆశీఃపూర్వక శ్రీముఖము వ్రాసిచ్చిన పరమహంస పరివ్రాజక జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామివారికి నమశ్శతములు*

# వాఙ్ముఖం

శ్రీ శిష్ట్లా లక్ష్మీపతి శాస్త్రిగారు నాకు చిరపరిచితులు. మొదట మొదట పరోక్షంగానూ రాను రానూ అపరోక్షంగా కూడానూ, ఢిల్లీలోని ఆంధ్ర విద్యా సంఘంలో వారు పనిచేస్తున్న రోజుల్లో కేవలం వారి నామరూపాలతోనే నాకు పరిచయం. ఆ తర్వాత మా అమ్మాయి వాఙ్మయి వారి కూతురు ఆదిలక్ష్మి స్నేహితంతో వారితో నాకు గల పరిచయానుభూతిని పరోక్షం నుంచి ప్రత్యక్షంగా రూపొందించింది. ఇదం క్షాత్రం, ఇదం బ్రాహ్మం - అన్న నానుడికి అనుగుణంగా వారు సమరశాఖలోనేగాక అమరకోశంలో కూడా నిష్ణాతులనీ, రచనా వ్యాసంగంలో సహజమైన ఆసక్తి కలవారనీ తెలిసింది.

ఈ 'అపరోక్షానుభూతి' వారి అక్షర సాన్నిధ్యాన్ని నాకు మరింత సన్నిహితం చేసింది. "అపరోక్షం" అంటే "పరోక్షం" కానిది కావచ్చు కాని, కేవలం ప్రత్యక్షంగా కనిపించేది కూడా కాదని తమ అనువాద పీఠికలో శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు స్పష్టీకరించారు. అయితే మరి యీ అనుభూతి ఏమిటి అంటే శ్రీ శంకర భగవత్పాదులు వ్రాసిన యీ గ్రంథం సమగ్రంగా చదివితే తెలుస్తుందని కూడా వారన్నారు.

అలాగే వారి అనువాదాన్ని మూలంతోపాటు నేను సమగ్రంగా చదివాను. పరోక్షప్రియులైన దేవతలు ఏ విషయం ప్రత్యక్షంగా చెప్పరు. దాన్ని మనం స్వాధ్యాయ వివేచనా శక్తితో ఆత్మగతం చేసుకోవాలి. దీనికి శ్రీ శాస్త్రిగారి అనువాదం పూర్తిగా సహకరిస్తుంది. భగవత్పాదుల భావలహరిని వారు సరళమైన తెలుగులో కరతలామలకం చేశారు. మూలంలోని మూల్యాన్ని అసలుకు అనర్థం చేకూరకుండా అందులో తెలుపని తెలివిని తన తెలుగు వెలుగులో కనిపింపచేసే ఇంపయిన అనువాదం శ్రీ శాస్త్రిగారు మనకు ప్రసాదించారు.

నిజానికి వేదమంత్రాలనూ, వేదాంతసూత్రాలనూ తత్త్వచింతనకు సంబంధించిన ఆర్ష రచనలను మరోభాషలో యథాతథంగా చెప్పటం ఎంత సమర్థులకయినా

కష్టసాధ్యమయిన పని. అక్కడక్కడ అప్పుడప్పుడు ఇది అసాధ్యం అని కూడా అనిపిస్తుంది. ఇది నేను స్వానుభవంతో చెబుతున్న విషయం. ఈశ, కేన, కఠ, మాండూక్యాదులను తెలుగులో గేయరూపంగా పద్యరూపంగా అనువదించినప్పుడు నేను అనుభవించిన రచనాయాసం శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారి 'అపరోక్షానుభూతి' అనువాదం చదివినప్పుడు మరోసారి నాకు స్ఫురించింది. కాని శాస్త్రిగారు కేవలం "ముత్యాల సరచ్ఛందోబద్ధానువాదం" తో తృప్తిపడక వ్యాఖ్యారూపంలో ప్రతి శ్లోకానికీ తాత్పర్యం కూడా వ్రాశారు. దీనితో అనువాదంలో వచ్చిన సమస్యలన్నీ అంతరించి మూలంలోని పదార్థం సులభంగా బోధపడటం సాధ్యమయింది. ఇది శ్రీ శాస్త్రిగారు చాలా చక్కగా నిర్వహించారు. అనువాదంలోని ఆంతర్యాన్ని తాత్పర్యం స్పష్టం చేసింది. కాబట్టి వీరి అనువాదం కేవలం పాఠ్యమే కాక గేయం కూడా అయింది. సరాల స్వరాలు గేయంగా ఉపకరిస్తే తాత్పర్యం పాఠ్యంగా పనికివస్తుంది. ఉభయతారకమయిన యీ అనువాదం భగవత్పాదుల మూల భావాన్నిచదువరులకు తేటతెల్లం చేస్తుంది.

ఇలాంటి చక్కని అనువాదాన్ని తెలుగువారికి అందించిన శాస్త్రిగారికి తెలుగువారు చాలా ఋణపడి ఉంటారు. ఈ రచనను శ్రద్ధగా చదివి శ్రీ శంకర భగవత్పాదులు ప్రవచించిన "అపరోక్షానుభూతి"ని అలాంటి వాగ్విభూతిలోనే ఆలకించి ఆనందించటమే ఋణ విముక్తికి ఏకైక మార్గం.

వయస్సులో, మనస్సులో, వచస్సులో, తపస్సులో ఆరితేరిన శ్రీ శిష్ట్లా లక్ష్మీపతి శాస్త్రిగారు ఇలాగే తమ వర్చస్సును సార్థకం చేస్తూ వాగ్దేవిని ఆరాధించాలని వారికి వాక్పతి అనుగ్రహం వాంఛిస్తున్నాను.

08.01.2000 ఇలపావులూరి పాండురంగారావు

---

*అడుగగనే వాఙ్ముఖం వ్రాసిచ్చిన ఆత్మీయులు డా॥ ఇలపావులూరి పాండురంగారావు గారికి విశేషకృతజ్ఞతలు*

– శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రి

# ఉపోద్ఘాతము

అపరోక్షానుభూతి గ్రంథం శ్రీమత్ శంకర భగవత్ పాదాచార్యులు రచించిన ప్రకరణ గ్రంథాలలో ఒక ముఖ్య గ్రంథం. అపరోక్షమైన అనుభూతి అంటే పరోక్షం కాని అనుభవం. అంటే ఇతరుల ద్వారా కలిగే అనుభవం కాదు. ప్రత్యక్షమూ కాదు. అంటే ఎదురుగా కనబడేదీ కాదు. ఆ అనుభవం స్వయంగా అలవరించుకొనేది. దానికి అనేక సాధనలున్నవి. ఆ సాధనలన్నీ వివరించేది ఈ అపరోక్షానుభూతి గ్రంథం.

అయితే, అది ఏ విధమైన అనుభవం ? మనకు ఎందుకు కలగాలి ? అనే ప్రశ్నలుదయించవచ్చు. ఆ అనుభవం మోక్షసాధన వలన కలిగే ఆనందానుభవం. "ఆనందో బ్రహ్మ" అన్నది వేదవాక్యం.

విజ్ఞానశాస్త్రం అనబడే ఈనాటి సైన్సు ప్రకారం కూడా, ప్రపంచకం అంటే వస్తుసంపుటి. అందులోని ప్రతి అణువూ కూడా వస్తువే, ఒక పదార్థమే. అది అనాది, అనంతం, అవ్యయం. Matter is neither creatable nor destructible అని భౌతికవిజ్ఞానం. పారమార్థికంగా కూడా అదే సూత్రం.

పరమాత్మ అద్వయమైన ఆత్మ వస్తుసంపుటి. అయితే భౌతికమైన పదార్థ సంపుటి ఎప్పుడో ఒకప్పుడు నశించేదే కాని, ఈ భౌతిక ప్రపంచానికి కారణభూతమైన పరమాత్మ అవ్యయం. ప్రపంచ పదార్థ సంపుటిలో అణువువలె జీవాత్మ, సంపుటియైన పరమాత్మతో భేదం లేనిది. పరమాత్మ సర్వ వ్యాప్తమై, అన్ని జీవాలలోనూ ప్రకాశిస్తుంది. ఆ ప్రకాశాన్ని సాధనచేసి, అలవరచుకొని, స్వకీయమైన ఆత్మలో ప్రతిఫలించుకొని, ఆనందించటమే అపరోక్షానుభూతి.

ఇందులో ఒక విషయం జాగ్రత్తగా అవలోకించాలి. ప్రపంచం భౌతికం. దేహం కూడా భౌతికమే. దీనివలన వచ్చే ఆనందపు పరాకాష్ఠ మానుషానందం - దానికి నూరు రెట్లు అంచెలు. ఉదాహరణకు మానుషానందానికి నూరు రెట్లు దేవానందం - దానికి నూరు నూర్ల రెట్లు గుణ ప్రవృద్ధికముగా - Geometrical Progression - తొమ్మిది అంచెలపైన బ్రహ్మానందం. భౌతికానందానికి పాంచ భౌతిక విషయాలు అంగాలైతే బ్రహ్మానందానికి - అంటే, ఆత్మానందానికి చైతన్యం

అంగం. ఇది భౌతిక విజ్ఞానానికి అందని విషయం.

పై విషయాలను బట్టి తేలేదేమంటే, ఈ అనుభూతి సాధించటానికి ముందు దీనిని సాధించాలి అనే స్థిరమైన భావం మనస్సులో ఉత్పత్తి అవ్వాలి. దానినే ముముక్షుత్వం అంటారు. దానిపైన సాధనక్రమాలు, ఆ క్రమాల కారణాలు, ఉపమానాలతో సహా జగద్గురువులు వ్యక్తీకరిస్తారు. వైద్యుడు జాడ్యాన్ని నివారించే చేదు మందు ఇస్తే, ఇంత చేదు మందు నాకు వద్దు, అని నిరాకరించేవారివలె, మాకే మోక్షమార్గం వద్దు అనేవారు దీనిని చదువనక్కరలేదు. మోక్షం అంటే చావు కాదు. చావు భౌతికమైనది. మోక్షమంటే బ్రతికి ఉండగానే వాసనా బంధాలు, జన్మ జన్మలవీ, నశించటం. ఉదాహరణకు కంచి పరమాచార్యుల వారు బ్రహ్మానంద సమాధిలో తత్పరులై ఉండగా వారి శరీరం మీద చీమలు పాకుతున్న విషయం వారికి తెలియదు. వారు జీవించే మోక్షం గడించారు.

ముముక్షువులైన వారు కూడా దీనిని తలచి తలచి చదువుకొని, అర్థం చేసుకోవాలి. కావ్యంలోని వస్తు లక్షణం అటువంటిది. అందులోనూ ఆచార్యులు వివాదాలకు ఆస్కారం లేకుండా, అత్యంత సూక్ష్మగ్రాహ్యత అవసరమయ్యే తార్కిక సిద్ధాంతాలతో ఈ గ్రంథ ప్రమాణాధికారాన్ని నిరూపించారు. అందుచేతనే, ప్రయత్నపూర్వకంగా మళ్ళీ మళ్ళీ చదవాలని మంగళశ్లోకం తరువాత గ్రంథారంభంలోనే చెప్పారు. తమ సిద్ధాంతాన్ని ధృఢం చేసేందుకు ఒకే విషయాన్ని అనేక విధాలుగా, అనేక ఉదాహరణలతో చెప్పారు. అవి పునరుక్త దోషాలు కావు. విషయానికి బలం చేకూర్చే అంగాలు.

దీనివలన భౌతికమైన ప్రయోజనమేమైనా ఉందా, అంటే తప్పకుండా ఉంది. సాధన సోపానంలో ప్రప్రథమమైన శమదమాది షట్కసంపత్తిని అలవర్చుకొన్నప్పుడే, మానవులలో సత్వవృత్తి అలవడుతుంది. వైరాగ్య సోపానం అధిగమించినా, లేకున్నా, ఈ సత్వవృత్తి సమాజంలో సౌమ్య ప్రవర్తనకు, దానిద్వారా ప్రపంచ శాంతికీ, దారి తీస్తుంది.

ఈ గ్రంథానికి వచన రూపంలో అనేక అనువాదాలున్నవి. కాని, వచనాన్ని పునః పునః పఠనం చేయటానికి మనస్సు సహకరించదు. ఈ రోజులలో పద్యం అంటేనే పారిపోతారు చదువరులు, మన దురదృష్టం కొద్దీ. అందుచేత ముత్యాలసరం

ఛందస్సులో పాటవలె పాడుకోవటానికి వీలుగా దీనిని రచించాను. వివరాలు వ్యాఖ్య రూపంలో ఇచ్చాను.

ఈ పుస్తక ప్రచురణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఎనిమిది వేల రూపాయలు ప్రదానం చేసి, నన్ను కృతార్థుణ్ణి చేసినారు. వారికి ఎనిమిది వేలకు ఎనిమిది వేలరెట్లు కృతజ్ఞతలు. ఈ పుస్తకం ఆమూలాగ్రం చదివి, అజ్ఞుడనైన నాచే చేయబడిన తప్పులను సరిదిద్ది, పుస్తకానికి జీవం పోసిన డా. ఏల్చూరి మురళీధరరావు గారికి ఎంత ఋణపడిఉన్నానో చెప్పలేను. వారి పాండిత్యం అనన్య సామాన్యం. నాచే రచింపబడిన ఇతర కావ్యాలన్నిటినీ గూడా వారే సరిదిద్ది, ప్రచురణార్థం చేశారు. నీరు శంఖంలో నుంచి వస్తేనే తీర్థమయినట్లు. వారికి పునః పునః ధన్యవాదాలు. నా వయస్సులో వారి వయస్సు దాదాపు సగం. అందుచేత నమస్కారాలు అనటానికి బదులు ధన్యవాదాలంటున్నా.

ఇది చక్కగా అచ్చువేసి, సమయానికి అందిచ్చిన పద్మశ్రీ గ్రాఫిక్స్, గాంధీనగర్, హైదరాబాదు వారికి నా కృతజ్ఞతలు. దీనిని క్షుణ్ణంగా చదివి, ఇందులోని అద్వైత రసాన్ని ఆస్వాదించిన వారికి, రుచించినా, రుచించకున్నా, చదివి, చవి చూచే వారికీ నా కృతజ్ఞతలు. వారి అభిప్రాయాలు తెలుపగోరుతాను. తెలిపినవారికి మరీ మరీ కృతజ్ఞతలు.

*ఓం తత్సత్*

శిష్ట్లా లక్ష్మీపతిశాస్త్రి

ఓం

## గురుభ్యోన్నమః

సం॥ శ్రీహరిం పరమానందం ఉపదేష్టార మీశ్వరమ్
వ్యాపకం సర్వలోకానాం కారణం తం నమామ్యహమ్ 1

తెలుగు : శ్రీహరికి నుపదేష్ట కీశ్వరు
కవ్యయానందునకు సర్వ
వ్యాపకునకును లోకకారణు
కంజలి ఘటింతున్ 1

వ్యాఖ్య : ఇది మంగళస్తోత్రము. మంగళాచరణము చేయుచున్నది సాక్షాత్తూ శ్రీ శంకరాచార్యులు. ఇది శ్రీహరి పరముగానున్నది. శ్రీహరియనగా ననేకములైన యర్థములున్నవి. లక్ష్మిని హరించినవాడు - అనగా శ్రీలక్ష్మిని తన హృదయస్థానమున నిలిపినవాడు, నిలుపనర్హుడైనవాడు, నిలుపగలిగినవాడు అని అర్థము. లక్ష్మి జీవాత్మ, శ్రీహరి పరమాత్మ. జీవాత్మ పరమాత్మల సమైక్యము చూపించు నద్వైత సిద్ధాంతమునకీ మంగళశ్లోకముతో శ్రీ శంకరాచార్యులవారు నాంది పలికినారు.

శ్రీహరి అవ్యయుడు. అనగా వ్యయములేనివాడు. నాశములేనివాడు. అవ్యయమైన పరమానంద స్వరూపుడు. "ఆనందో(బ్రహ్మ" అన్నది శ్రుతి. ఆనందమే పరమాత్మ. కనుక, జీవాత్మను హృదయములో సమైక్యము చేసికొన్న పరమాత్మ శ్రీహరి పరమానందస్వరూపుడు. శ్రీహరి ఉపదేష్ట. అనగా కేవలము గురువేకాదు, హృదయములోనికి చొచ్చుకొనిపోవు నుపదేశమునిచ్చువాడు. శ్రీహరి ఈశ్వరుడు, సర్వలోకములకు వ్యాపించినవాడు. అన్ని జీవాత్మల సంపుటి కనుకను, తన పరమాత్మ తత్త్వము సర్వజీవములయందు వ్యాపింపజేయగలిగినవాడు గనుకను, సర్వలోక వ్యాపకుడు. శ్రీహరి సర్వలోక సంభూతికి కారణుడు. శ్రీహరి

బ్రహ్మను సృష్టికి నియోగింపగా, అది వశముకాక, బ్రహ్మ తబ్బిబ్బయినాడు. తననుండి ముందుగా నుద్భవించిన సనక, సనంద, సనత్కుమార, సనత్సుజాతులు పుట్టినతోడనే తపశ్శీలురై వెడలినారుగాని, సృష్టిని కొనసాగింప నుద్యుక్తులు కాలేదు. పిదప జనించిన పదిమంది మహర్షులు అదే విధముగా వెడలిపోయినారు. తమమున మునిగిన బ్రహ్మ తడవకు తన శరీరము విడిచి, వేఱొక శరీరము దాల్చవలసి వచ్చినది. అందునుంచి గూడ భయంకరులైన రుద్రులు ప్రభవించుటచే సృష్టిచేయుట కసమర్థుడై, తగిన శక్తిని తనకిమ్మని బ్రహ్మ శ్రీహరిని ప్రార్థించినాడు. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు కలుగుటకుగాను శ్రీహరి సరస్వతిని బ్రహ్మకు తోడుగా పంపి, వానిని సృష్టిపారగుని చేసినాడు. ఈ విధముగా శ్రీహరి లోకకారణుడు. అట్టి పరమాత్ముడైన శ్రీహరికి జీవాత్మని నమస్కార స్తోత్రముతో మంగళాచరణముగా నీ కావ్యమారంభింపబడినది.

శ్రీహరి లక్ష్మిని హృదయములో నుంచికొనినాడనుట కేవలము పురాణోక్తముకాదు. ప్రతిజీవుడు తన భార్యకు హృదయములో స్థానము నీయవలెనని దాని యర్థము. జీవమున్న ప్రతిభూతము జీవాత్మ. జీవాత్మ పరమాత్మల సమైక్యమును స్వకీయానుభవముతో సాధించు పరమార్థమీ కావ్యార్థము కనుక ఈవిధమైన శ్రీహరిస్తుతి అపరోక్షానుభూతి కావ్యౌచిత్యము ప్రసాదించుచున్నది.

ఇంకొక విషయమేమంటె హృదయం షోడశదళయుతమైన అనాహతాబ్జ స్థానం. అది వాయుతత్త్వయుతం. కనుక ప్రాణవాయువు నకాస్పదం. అందుచేత కూడా 'వ్యాపనం సర్వలోకానాం' అంతేకాన లోకసంస్థితికి కూడా ఆస్పదుడైనాడని చెప్పవచ్చును.

సం॥ అపరోక్షానుభూతిర్వై, ప్రోచ్యతే మోక్షసిద్ధయే
సద్భిరేవ ప్రయత్నేన, వీక్షణీయా ముహుర్ముహుః 2

తెలుగు : మోక్షసిదికి తెలుపుచుంటిని,
దీని నపరోక్షానుభూతిని
సజ్జనులకిది పూని పరిపరి
పఠన( జేయ దగున్ 2

వ్యాఖ్య : ఈ శ్లోకం ఈ గ్రంథం యొక్క ప్రయోజనము వివరించునది. అపరోక్షము అనగా పరోక్షముకానిది. అనగా ఇతరుల కళ్ళతో చూచినది కాదు. ఇది ప్రత్యక్షము కూడా కాదు. ప్రత్యక్షమనగా మన కండ్లముందు కనపడెడిది. అనగా తనకు వేరుగా కనపడునది. ఇది అటువంటిది కూడా కాదు. స్వకీయముగా అనుభవవేద్యము. అనగా తనంతట తాను తెలుసుకొని అనుభవించునది. ఇది మోక్షసిద్ధి కొఱకు చెప్పబడినది. అనగా చదువరి, మోక్షసిద్ధికి కావలసిన సాధనములు స్వయముగా అలవరించుకొని, అభ్యాసము చేసి, అనుభవించవలసిన సిద్ధి. అది అంత తేలికగా అలవరించుకొనగలిగినదికాదు. అందుచేత ప్రయత్నపూర్వకముగా మరలమరల చదువుచూ, అర్థము చేసికొనవలెను. అది కూడా సచ్ఛీలురే చేయవలయును. నిర్మలహృదయం కలిగిన సజ్జనులకే ఈ అపరోక్షానుభూతి సాధ్యము. కనుక మోక్షసిద్ధిని కోరువారందరూ సచ్ఛీలము ముందుగా నలవర్చుకోవాలి. ఆ పిదప, తరువాత శ్లోకములలో ఉగ్గడించిన సాధనకు పూనుకొనవలెను. సచ్ఛీలమే జ్ఞానమునకు ఆది. సత్త్వగుణమే సచ్ఛీలతకు పునాది. రజస్తమో గుణములలో మునిగియున్న వారికి సాధనము ఎడారిలో నీరు వెదుకుటవంటిది. సత్త్వశీలతతో కూడిన జ్ఞానమే అపరోక్షానుభూతికి

- జీవన్మోక్షసాధనకు ఆలంబనము. అందుచేతనిది పునిపుని, ప్రయత్నించి ప్రయత్నించి పఠన( జేయవలెను.

ఈ కావ్యం శ్రీ శంకరాచార్యులవారు తమ 'వివేకచూడామణి' కి చాలవఱకు ప్రతిబింబంగా సృష్టించారని చెప్పవచ్చును. 'వివేకచూడామణి' లో కూడా సాధనసంపత్తి, తద్ద్వారా లబ్ధమయ్యే 'స్వనుభవం' వివరించారు. 'వివేకచూడామణి' ప్రప్రధమంలోనే "జంతూనాం నరజన్మ...." అనే శ్లోకంలో "విద్వత్త్వమ్", "ఆత్మానాత్మ వివేచనమ్", "స్వనుభవం", "బ్రహ్మాత్మనా సంస్థితిః ముక్తిః" అన్న సూక్తులలోనే ఇది ఇమిడి ఉన్నది. "విద్వత్తమ్" అనగా తెలిసికొని ఉండే స్థితి. శ్రవణ, మననల ద్వారా వేదార్థం తెలిసికొనటం. ఇది పరోక్షానుభూతి. ఆ వేదార్థాన్ని సతతం మననం చేయడంవలన "ఆత్మనాత్మ వివేచనమ్" కలుగుతుంది. అదే "స్వనుభవం" స్వకీయమై, అపరోక్షమైన అనుభూతికి దారితీస్తుంది. "బ్రహ్మాత్మనా సంస్థితిః ముక్తిః" అనటంవలన, బ్రహ్మమును ఆత్మలో ఉంచి చూడటమే ముక్తి అని తెలుస్తుంది. అనగా సారూప్య, సాలోక్య, సామీప్యాదులకన్న, ఆత్మసాక్షాత్కారమే ముఖ్యమని తెలుస్తుంది. అది జీవించి యుండగనే కలుగుతుంది కనుక ఆత్మసాక్షాత్కారం జీవన్ముక్తి. అటువంటి జీవన్ముక్తి కలిగినవానికి జీవితాంతమైనపుడు బ్రహ్మసాయుజ్యం తప్పనిసరికదా!

వ్యాఖ్య : ఈ గ్రంథ ప్రయోజనమైన అపరోక్షానుభూతి ఏవిధంగా లభ్యమవుతుందో తరువాత శ్లోకాలలో చెప్పబడినది.

సాధన చతుష్టయము

సం॥ స్వవర్ణాశ్రమ ధర్మేణ తపసా హరితోషణాత్
సాధనం ప్రభవేత్ పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ 3

తెలుగు : స్వీయవర్ణాశ్రమ తపస్సుల
శ్రీహరిని సంతుష్టఁ జేసిన
సిద్ధియగు వైరాగ్యముఖ సా
ధన చతుష్టయము 3

వ్యాఖ్య : ఈ గ్రంథ ప్రయోజనమైన అపరోక్షానుభూతి ఏవిధంగా లభ్యమవుతుందో పై శ్లోకాలలో చెప్పబడినది.

తమ తమ వర్ణాశ్రమ ధర్మాలద్వారా తపస్సుతో శ్రీహరిని సంతోషపరచితే, ఆ తపస్సువలన, ఆ అనుభూతికి కావలసిన సాధనములు లభ్యమగునని తాత్పర్యం. తపస్సు చేయటమంటే అవిరళంగా చింతన చేయటమన్న మాట. ఆ నిరంతర చింతనమువలన ఏకాగ్రత ఏర్పడుతుంది. ఏకాగ్రతతో కార్యసాధన అవుతుంది. ఈ సాధనములు వైరాగ్యము మొదలైనవి నాలుగు అవి,

i) వైరాగ్యము, ii) సమ్యక్ వివేకము, iii) శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధి అను శమదమాదిషట్కము, iv) ముముక్షుత్వము.

శ్రీమచ్ఛంకర భగవత్ పాదాచార్యులవారు ఈ కావ్యము వ్రాసినప్పుడు వర్ణాశ్రమ ధర్మాలు పాటింపబడేవి. ఆ రోజులలో వర్ణాలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఇవి కులాలు కావు. వారికి నిర్దేశింపబడిన ధర్మాలు ఆచరించవలసిన వారి వర్గాలు. ఇవి జన్మతః వచ్చేవి కావు. వారి వారి గుణం వలన, కర్మవలన సంభవించేవి. చాతుర్వర్ణం మయాసృష్టా గుణకర్మ విభాగశః అని శ్రీకృష్ణ పరమాత్మ నిర్దేశించాడుకదా.

భగవద్గీత గుణమంటే సత్వరజస్తమో గుణాలలో ఒకటి. అంటే ఏ జన్మదైనా కావచ్చును. వాటి యోగ్యతను బట్టి మానవుడి వర్ణం నిర్ణయమవుతుంది. కాలానుగుణంగా వీనిలో మార్పులు కలగటం విపరీతం కాదు. ధర్మమంటే మతస్థితికాదు. బాధ్యత, ప్రాజ్ఞులు విధించినది. ఏ బాధ్యత ఏఏ వర్ణాలకు నిర్దేశింపబడినదో ఆ బాధ్యతా నిర్వహణతో తపస్సు చేయాలి. అప్పుడు శ్రీహరికి సంతోషమవుతుంది. ఇదివరకు చెప్పినట్లు, శ్రీహరి అంటే కేవలం వైకుంఠుడు అని కాదు. పరిపక్వం చెందిన ప్రతి ఆత్మ శ్రీహరే. కనుక తపస్సు చేసేవానికే తృప్తికరంగా ఉండాలి. అప్పుడే పరమాత్మకు కూడా తృప్తికరంగా ఉంటుంది. హరి సంతోషిస్తాడంటే జీవుని ఆత్మ ఆనందమయమయి అపరోక్షానుభూతికి దోహదమవుతుంది. వ్యవహారార్థకంగా మనస్సు సంతోషిస్తుంది. అందుమూలంగా ఆత్మతుష్టి కలిగి, పరమాత్మకు తృప్తి కలుగుతుంది.

ఈ సాధన చతుష్టయమును గూర్చిన వివరములు శ్రీమద్భగవత్పాదులు తరువాత వచ్చే శ్లోకాలలో వివరిస్తారు.

"స్వవర్ణాశ్రమ ధర్మేణ" అనుటలో ఈ సాధనములు స్వీయవర్ణ ధర్మమూ, స్వీయ ఆశ్రమ ధర్మమూ పాటిస్తూ చేయాలి. భగవద్గీతలో భగవానుడు "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనంశ్రేయం, పరధర్మో భయావహః" అని శాసించాడు. పై శ్లోకంలో మోక్షసిద్ధికి ఆచరించవలసిన సాధనములలో స్వవర్ణ ధర్మమూ, స్వ ఆశ్రమ ధర్మమూ తప్పక పాటించాలని శంకరాచార్యులు నిర్దేశిస్తున్నారు. ఎందుచేతనంటే పరధర్మము, అనగా తన వర్ణమునకు నిర్దేశించని ధర్మము, తన ఆశ్రమమునకు నిర్దేశింపని ధర్మము, భయావహములు గనుక, ఆశ్రమములంటే బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలు. ఏ ఆశ్రమములోనున్నవారు ఆ ఆశ్రమధర్మ ప్రకారం అంటే ఆ ఆశ్రమంలో ఉండే సాధన చేయాలి. అప్పుడే పరమాత్మకు ప్రసన్నత కలుగుతుంది.

ఈ సాధన చతుష్టయములో మొదటిది - వైరాగ్యము

సం : బ్రహ్మాది స్థావరాంతేషు, వైరాగ్యం విషయేష్వను
యథైవ కాకవిష్టాయాం వైరాగ్యం తద్ధి నిర్మలా 4

తెలుగు : బ్రహ్మ మొదలుగ స్థావరాంతము
నన్ని కోర్కెలు కాకవిష్టము
లట్లు వదలుటె విమల వైరా
గ్యంపు లక్షణము 4

వ్యాఖ్య : వైరాగ్యం శ్రీమత్ శంకరు లుద్ఘాటించిన సాధన చతుష్టయంలో మొదటిది. సృష్టికి మొదలు బ్రహ్మ. స్థావరము యొక్క అంతము - అంటే పరమాణువు వరకు. అనగా ప్రాపంచిక విషయములన్నిటినీ కాకిరెట్టను విదల్చిపారవైచినట్లు పారవేయాలి. అదే నిర్మలమైన వైరాగ్యము. శ్మశాన వైరాగ్యము వంటి వైరాగ్యము కాదు. పరిపూర్ణ వైరాగ్యము. కాకిరెట్ట ఎందుకూ పనికిరానిది. చివరకు గాడిద పెంట కూడ ఒక్కొక్కసారి పనికివస్తుంది. చావటానికి సిద్ధంగా ఉన్నవానికి, గాడిదపెంట పూస్తే వేడిపుట్టి, మృతుడు కాకుండా చేస్తుందిట. ఇంకా అటువంటిది పంటచేలలోనూ, తోటమొక్కలకు, బలముకొఱకై వేస్తారు. కాని కాకిరెట్ట ఎందుకూ పనికిరాదు. ఆ పనికిరాని కాకిరెట్టను ఏ విధంగా విసిరివేస్తామో, ఆ విధంగా ప్రాపంచిక విషయాలన్నిటినీ త్రోసివేయాలి. ఎందుచేతనంటే అవి అశాశ్వతాలు. శ్మశాన వైరాగ్యమంటే, శ్మశానంలో శవం తగులబడుతూ ఉన్నప్పుడు చూచేవానికి జీవితంపై తాత్కాలిక విరక్తి పుట్టవచ్చు. అటువంటి తాత్కాలిక వైరాగ్యం కాకుండా, నిర్మలమైన వైరాగ్యం రావాలి. అదేవిధంగా విషయభోగాలు అనుభవించి అనుభవించి, తృప్తితీరి వాటిని వదలిపెట్టడం కూడా నిర్మల వైరాగ్యంకాదు. ఎందుచేతననగా వాటిపై మళ్ళీ ఆశ తలెత్తి, వైరాగ్యం తలక్రిందులు కావచ్చు. అందుచేతనే వైరాగ్యం తద్ధి నిర్మలం అన్నారు శంకరాచార్యులు. సమ్యక్ వివేకప్రభూతమే, అంటే నిత్యానిత్యవివేక సంజనిత వైరాగ్యమే నిర్మలమైన, సిసలైన వైరాగ్యం. ఈ వైరాగ్యం కలగటానికి మెట్టు వివేకము - సమ్యక్ వివేకము అనగా అసలైన వివేకము, సత్యమైన వివేకము.

సాధన చతుష్టయములో రెండవది సమ్యగ్వివేకము - నిజమైన వివేకము

సం : నిత్యమాత్మ స్వరూపం హి దృశ్యం తద్విపరీతగమ్
ఏషం యో నిశ్చయః సమ్యగ్వివేకో వస్తునః సవై 5

తెలుగు : నిత్యమొక యాత్మస్వరూపమె
దృశ్య మితర మనిత్యమను నీ
వస్తురూప వినిశ్చయమె స
మ్యగ్వివేక మనన్ 5

వ్యాఖ్య : ఇక సాధన చతుష్టయములోని సమ్యగ్వివేకము గురించి. ఆత్మ ఒక్కటే నిత్యము. మనకు కనిపించే ఇతరములన్నియూ – అంటే కంటికే కాదు, అన్ని యింద్రియములకు, మనస్సుకు, బుద్ధికి గోచరించే విషయములన్నియు అనిత్యములు. ఎందువలననంటే ఎప్పుడో ఒకప్పుడు అవి నశిస్తవి. ఈ విషయము తెలుసుకొని నిశ్చితము చేసికొనుటే సమ్యక్ వివేకము. అద్వైత సిద్ధాంతములోని "జగన్మిథ్యా" "బ్రహ్మసత్యం" అను సూక్తులకు ఇది ఛాయ. ఈ ఆత్మానాత్మ వివేకము కలిగినప్పుడే నిర్మల వైరాగ్యం మొలకెత్తుతుంది. దానికిది మెట్టు.

ఇక సాధన చతుష్టయములోని మూడవదియైన శమదమాదిషట్కము గురించి. అవి

1) శమము, 2) దమము, 3) పరమోపరతి, 4) తితిక్ష, 5) శ్రద్ధ 6) సమాధానము (లేక సమాధి)

సం : సదైవ వాసనాత్యాగః శమో యమితి శబ్దితః
నిగ్రహో బాహ్యవృత్తీనాం దమ ఇత్యభిధీయతే 6

విషయేభ్యః పరావృత్తి పరమోపరతి ర్హి సా
సహనం సర్వదుఃఖానాం తితిక్షా సా శుభామతా 7

నిగమాచార్య వాక్యేషు భక్తిః శ్రద్ధేతి విశ్రుతా
చిత్తైకాగ్ర్యంతు సల్లక్ష్యే సమాధాన మితి స్మృతమ్ 8

తెలుగు : పూర్వసంగత వాసనా ని
గ్రహము శమమన తెలియు నర్థము
బాహ్యవృత్తి నిరోధనంబే
దమము నా బఱగున్ 6

వివిధ విషయనివృత్తియే పర
మోపరతి యని యండ్రు ప్రాజ్ఞులు
దుఃఖ సహనంబే తితి క్షది
సర్వశుభదం బి య్యిలన్ 7

వేదముల గురువాక్యములనగు
భక్తియేశ్రద్ధండ్రు నిజల
క్ష్యమున చిత్తైకాగ్రత సమా
ధానమండ్రు బుధుల్ 8

వ్యాఖ్య : శమమనగా పూర్వవాసనల త్యజించుట, లేక నిగ్రహించుట. పూర్వవాసనలనగా ఈ జన్మములోనివేకాదు. పూర్వజన్మములలోని అనుభవములు కూడా, వాసనాపూర్వకముగా మన మనస్సులో స్థిరపడి ఉంటవి. దీనినే కాళిదాసు "భావస్థిరాణి జననాంతర సౌహృదాని" అన్నాడు. అట్టి వాసనలు తిరిగి తిరిగి పునరనుభవానికి దారితీయగలవు.

ఇంకొక ఉదాహరణము. మనము ప్రొద్దుననే కాఫీ త్రాగటానికి అలవాటు పడియున్నాము. వైరాగ్యంతో అది మానినా దానిరుచి, వాసన, అవసరము, మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం వస్తుంటాయి. అట్లా రాకుండా నిగ్రహించుకోవటమే శమం. వార్ధక్యంలో, భార్యావియోగం వలన కాని, ఇతర కారణాలవలనకాని, కొందఱు సన్యాసం స్వీకరిస్తారు. అయినా తమ అనుభవాలన్నీ మనస్సులో మళ్ళీమళ్ళీ తిరుగుతూనే ఉంటవి. వాటిని నిరోధించటమే లేక నిగ్రహించుటే శమము.

బాహ్యవృత్తి అనగా బాహ్యేంద్రియములను నిరోధించుటే దమము. అంటే బాహ్యమైన ఇంద్రియాలకు, కండ్లకు, చెవులకూ, నోటికి వగైరా కలిగే ఇచ్ఛకత - కోరిక - నిరోధించుకొనటమే దమము. సన్యసించినా, అరే, మంచి సినిమా వచ్చిందిట చూద్దాం అని బుద్ధి కలగటం బాహ్యవృత్తి. రమ్యమైన పాటకచేరి జరుగుతున్నది, ఈ ఒక్కటీ విందాములే అనుకోవటం బాహ్యవృత్తి. ఇక జిహ్వేంద్రియానికీ, గుహ్యేంద్రియానికీ జనించే కోర్కెలు చంపుకొనటం మరీకష్టం. అన్ని కోర్కెలనూ, అటువంటివాటిని, ప్రయత్నపూర్వకంగా చంపుకొనటమే దమము.

పూర్వం ఒక కోతి నిగ్రహంతో తపస్సు చెయ్యాలని ఒక గురువుగారిని ఆశ్రయించిందట. అసలు బుద్ధి అనేదే కోతి, అందులో కోతిబుద్ధి మరీ కోతి. కనుక నీకు తపస్సు తగదు. అని గురువు గారంటే, కాదు స్వామీ, నా మనస్సుకు ఏకాగ్రత వచ్చింది. అందువలన మీ వద్దకు

వచ్చాను. మీ శిష్యునిగా చేర్చుకోండి అని ప్రార్థించిందిట. సరేనని గురువుగారు ఒక అరటిపండు కొంచెం ప్రక్కన పెట్టి లోపలకు వెళ్ళారట. ఆ అరటిపండును చూచేసరికి, కోతికి నోట్లో నీరు కారటం మొదలు పెట్టిందిట. ఎంత నిగ్రహించినా కోతికి మనస్సాగలేదు. పోనీ, ఇవ్వాళకొక్క రోజుకూ ఉండి రేపణ్ణించీ తపస్సు మొదలుపెడ్దాములే అని, లేచి ఆ పండు తీసికొని గబగబా తినేసిందిట. అటువంటి బుద్ధిని ప్రయత్నపూర్వకంగా చంపుకోవటమే దమం.

బాహ్యవృత్తి నిరోధించినా వాసనాపూర్వకంగా కాక, ఇతరత్రా ఒక్కొక్కప్పుడు విషయేచ్ఛలు మొలకెత్తవచ్చును. వానియెడల పరాఙ్ముఖత, పరమోపరతి. ప్రయత్నించి ప్రయత్నించి శమము అనుభవానికి వచ్చేటట్లు చేసుకున్నాము. ప్రతిఘటించి, ప్రతిఘటించి బాహ్యవృత్తి నిరోధకమైన దమము అలవర్చుకోగలిగాము. అయినా ఆ వాసనలు, ఇచ్ఛలు అప్రయత్నంగా జనించవచ్చు. అవి ఇదివరకే నిరోధించాము. ఇప్పుడు వాటి యెడల పరాఙ్ముఖత - అసహ్యము కలుగుతుంది. అదే ఉపరతి. ఆ సంపూర్ణ పరాఙ్ముఖతే పరమోపరతి.

తితిక్ష అనగా క్షాంతి, ఓర్పు. ఎట్టి దుఃఖమునైనా సహించుట - అనగా అవి తనకంటినవి కాదన్న భావంతో దుఃఖాలను ప్రతిఘటించే శక్తియున్నా, పట్టించుకోకుండా సహించి ఊరుకోవటమే తితిక్ష.

ఉదాహరణకు ఆకలిదప్పులు. వాటియెడలపరాఙ్ముఖత కష్టము. అవి సహించుకొని, వానికొఱకు ఎగబడకుండా ఉండటమే తితిక్ష. స్వామి వివేకానందుడు ఒకసారి రైలులో ప్రయాణం చేస్తుండగా భోజన సమయమయింది. అదే మొదటి తరగతి పెట్టెలో ప్రయాణం చేస్తున్న ఒక ఆంగ్లేయుడు భోజనం తెప్పించుకొంటూ మీరు భోజనానికి ఆర్డరు ఇవ్వలేదేమిటి అని అడిగాడు. వివేకానందుడు నవ్వుతూ, నాకు ఇప్పుడు

భోజన ప్రాప్తముంటే భగవంతుడే భోజనం పెడ్తాడు అని సమాధానం చెప్పాడు. ఈ హిందూ సాధువులు పిచ్చివారు అనుకొని నవ్వుకొని ఆ ఆంగ్లేయుడు తన భోజనం ముగించాడు. తరువాత స్టేషన్‌లో ఒక మార్వాడీ వ్యక్తి వెతుకుతూ వివేకానందస్వామి ఉన్నపెట్టె వద్దకువచ్చి ఆయనతో స్వామి! మీరీ రైలులో ప్రయాణం చేస్తున్న సంగతి తెలిసి, ఇది భోజన సమయం కనుక మీకు భోజనం తెచ్చాను. అని తను తెచ్చిన టిఫిన్ కేరియరు స్వామికిచ్చాడు. ఆంగ్లేయుడు ఆశ్చర్యపోయి, హిందూ సాధువులు పిచ్చివారుకాదు, దైవానుగ్రహం కల యోగ సంపన్నులు అని తేల్చుకున్నాడు. వివేకానందస్వామి ఆకలి సహించి భగవంతుడే అన్నం పెడ్తాడని ఊరుకున్నాడు. అది తితిక్ష.

శమదమాది షట్కములో చివరివి శ్రద్ధ, సమాధాము. వేదముల యెడ, గురువుల వాక్యములయెడ భక్తికలిగి వినుట శ్రద్ధ. చేసేపనిమీద ధ్యానమునుంచి చేయుట శ్రద్ధ. ఏ పని చేయటానికైనా శ్రద్ధకావాలి. శ్రద్ధగా చదువుకొనుమని విద్యార్థులకు చెప్తుంటారు. ఎంత ప్రయత్నం చేసినా, శమదమాదులు శ్రద్ధతో చేయనిదే ఫలించవు. భగవద్గీతలో ఈ శ్రద్ధ గురించి మరీమరీ సావధానపరిచాడు కృష్ణపరమాత్మ.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం 4-39
అజ్ఞశ్చ, అశ్రద్ధధానశ్చ, సంశయాత్మా వినశ్యతి 4-40
శ్రద్ధావన్తో అనసూయన్తో ముచ్యన్తే తే2పి కర్మభిః 3-31
శ్రద్ధయా భజతే యో మాం నమే యుక్తతమో మతః 6-47
శ్రద్ధయా పరమోపేతా స్తే మే యుక్తతమో మతః 12-2
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే 17-13

(ఇంకా అనేకాలు)

అసలైన లక్ష్యముమీద అనగా నిత్యానిత్య వివేచన జ్ఞానలబ్ధికి చిత్తము నేకాగ్రముగా నుంచుట సమాధానము, లేక సమాధి. అదే తపస్సు కూడాను. ఇది శ్రద్ధకు పరాకాష్ఠ.

సం : సంసార బంధనిర్ముక్తిః కథం మే స్యాత్కదా విభో!
ఇతి యా సుదృఢా బుద్ధిః వక్తవ్యా సా ముముక్షుతా! 9

ఉక్తసాధన యుక్తేన విచారః పురుషేణ హి
కర్తవ్యో జ్ఞానసిద్ధ్యర్థం ఆత్మనః శుభమిచ్ఛతాః 10

నోత్పద్యతే వినా జ్ఞానం విచారే ణాన్యసాధనైః
యథా పదార్థభావం హి ప్రకాశేన వినా క్వచిత్ 11

తెలుగు : ఓ దయానిధి! నాకు సంసా
రమున నుండి విముక్తి ఎట్లగు?
ననెడి తీవ్రావేదనె ముము
క్షుత్వమందు రిలన్ 9

ఆత్మశుభమును గోరు నరు డీ
నాల్గు సాధనలను విచారణ
చేయుటే కర్తవ్య మాతఁడు
జ్ఞానసిద్ధి గనన్ 10

ఈ విచారణ లేక జ్ఞానము
కలుగదిం కే సాధనలకును
వెలుఁగులేక పదార్థభావము
కలుగకున్నటులన్ 11

వ్యాఖ్య : ఓ దయానిధీ! ప్రభో! ఈ సంసారబంధముల నుండి విముక్తి ఎట్లా కలుగుతుంది స్వామి! అని దృఢబుద్ధితో విచారించటమే ముముక్షత్వము. సాధన చతుష్టయములో చివరకు చెప్పబడినను, ఇదే ప్రథమ సోపానము.

వైరాగ్యాది సాధన చతుష్టయంలో నాల్గవది ముముక్షుత్వం. తనకు మోక్షం కలగాలి అని సాధకుడు ముందుగా నిశ్చయించుకోవాలి. ఇది

చాల కష్టముగా కలుగునది. శంకరాచార్యులు వివేకచూడామణిలో, ప్రపంచకంలో దుర్లభమైన మూడిటిలో ముముక్షుత్వం ఒకటిగా ఉద్ఘాటించారు. అవి "మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయం" అని మూడు.

సంసారబంధాలంటే గృహబంధాలుకావు. ప్రాపంచిక బంధాలు. ఈ విముక్తి ప్రపంచంనుంచి విముక్తికాదు. బంధాలనుంచి విముక్తి. జీవితంలోనే ఈ విముక్తి లభ్యమగుతుంది. దాన్నే జీవన్మోక్షం అంటారు. అది అనుభవించినవారు ఈ కాలంలో కూడా ఉన్నారు. శృంగేరి, కంచి పీఠాధిపతులు, రామకృష్ణ పరమహంస, అరవిందయోగి, వివేకానంద ఈ కోవకు చెందినవారు. ఇప్పటివారైన బెల్లంకొండ రామారావుగారు ఈ విధంగా జీవన్మోక్షం గడించినవారని ప్రతీతి.

ఆత్మశుభమును కోరువాడీ నాల్గుసాధనములు అనుసరిస్తుండాలి. ముముక్షువు శమదమాది షట్కము లభ్యాసము చేసి, నిత్యానిత్య వివేకవంతుడై నిర్మల వైరాగ్యవృత్తితో స్వవర్ణాశ్రమస్థితిలోనే జీవన్మోక్ష మందుకోగలడు.

ముందు ముముక్షుత్వము మనస్సులో కలిగితే శమదమాది షట్కాలు సాధన చేయాలి. దానివలన నిత్యానిత్య సమ్యక్‌జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం వైరాగ్యానికి దారితీస్తుంది. ఇది సోపానక్రమము.

ఆత్మశుభమును కోరువారంటే ఆత్మకు శుభం కోరేవారని కాదు. ఆత్మ ఎప్పుడూ, దేనికీ అందనిదే, శుభమైనదే. ఆత్మశుభమంటే తన స్వకీయమైన శుభమన్నమాట. అంటే ఈ సాధన చతుష్టయంలో మోక్షసిద్ధి సాధించకపోతే, ఐహికంగా తనకు శుభం శూన్యమన్నమాట.

పైన చెప్పిన సాధనచతుష్టయములవలన కాక మరియే ఇతర సాధనల వలననూ నిత్యానిత్య జ్ఞానం కలుగదు. వెలుగుంటేనే చీకటిపోయి వస్తువు ప్రకాశించినట్లు సాధన గురించిన ఈ నిరంతర విచారమువలన అవిద్య నశించి, జ్ఞానం ప్రకాశితమగుతుంది. ఇంకేవిధంగానూ కాదు.

ఈ విచారణ మేవిధముగా చేయవలెనన్న విషయము చెప్పబడుచున్నది

సం : కోహం? కథమిదంజాతం? కోవైకర్తాస్యవిద్యతే
ఉపాదానం కిమస్తీహ విచారః సోయమీదృశం 12

నాహం భూతగణోదేహో, నాహంచాక్షగణస్తథా
ఏతద్విలక్షణః కశ్చిద్విచారః సోయమీదృశం 13

తెలుగు : నేనెవండ? నిటేలపుట్టితి?
కర్తఎవ్వరు? జగతికెదియా
ధార? మెదికారణ? మటన్నవి
యా విచారవిధుల్ 12

కానుభూత గణాత్మకుడ నిం
ద్రియ సమూహ గుణాత్మకుండును
నే విలక్షణుడన్నయట్టివె
యా విచారవిధుల్ 13

వ్యాఖ్య : నేనెవడను? ఈ ప్రపంచం ఎట్లా పుట్టింది? దీనికి కర్త ఎవరు? ఉపాదాన కారణం (అంటే అవినాభావ కారణం) ఏమిటి? (ఉదా : కుండకు మట్టి ఉపాదాన కారణం, కుమ్మరి, ఘటయంత్రము వగైరా నైమిత్తిక కారణాలు) అని ఈ విధంగా విచారణ చేయాలి.

నేను పంచభూతముల చేత సృజింపబడిన వాడనుకాను. (ఎందుచేతనంటే నాలో చైతన్యం ఉంది. జడత్వం కాదు) ఇంద్రియ సమూహాన్నీ కాదు. (ఎందుచేతనంటే వాటిని వేరేవో శక్తులు నడిపిస్తున్నవి కాని అవి స్వతంత్రాలు కావు) కాన వీటన్నిటికీ భిన్నుడను విలక్షణుడను అన్న విధంగా విచారణ జరగాలి.

సం : అజ్ఞాన ప్రభవం సర్వం జ్ఞానేన ప్రవిలీయతే
సంకల్పో వివిధః కర్తా - విచారః సోయమీదృశం 14

తెలుగు : కర్మములు సంకల్పములు న
జ్ఞాన జనితజగంబు సర్వము
జ్ఞానమున లయమందు ననెడివె
యా విచారవిధుల్ 14

వ్యాఖ్య : ఈ విచారక్రమంలో జగత్తు ఏవిధంగా ఉత్పత్తి అయింది అన్న ప్రశ్నకు సమాధానం కొఱకు చేసే ఆలోచన ఈ శ్లోకం. "తెలియని విషయములన్నీ తెలివిడి కలిగినప్పుడు ఆ తెలివిడిలో లయమైపోతవి. ఉదాహరణకు ఏదైనా వస్తువు పోయినప్పుడు ఎవరిమీదైనా అనుమానం కలిగి వాడు దొంగ అని నిర్ణయిస్తాము. కాని నిజం బయటపడినప్పుడు వాడు దొంగ కాదని తెలిసినప్పుడు ఆ పూర్వ నిర్ణయం లయమైపోతుంది. వేదాంతులు రజ్జుసర్పభ్రాంతి నొక ఉదాహరణగా చెప్తారు. చీకటిలో రజ్జువు (త్రాడు) చూచి పాము అని భయపడుతాము. అది అజ్ఞానము. అది నిజంగా పామైతే కదలదేమి? తల, తోక పాముకువలె కనపడటంలేదు. అని మనలో మనం విమర్శించుకొని అది పాముకాదని తెలుసుకుంటాము. లేదా ప్రకాశం వచ్చినప్పుడు అది త్రాడనీ, పాముకాదనీ తెలుస్తుంది. కనుక అజ్ఞానప్రభవమైన సర్వమూ జ్ఞానంలో లయమౌతుంది. మనం జాగ్రదావస్థలో నున్నప్పటి అనుభూతులు కొన్ని స్వప్నావస్థలో ప్రభవమవుతుంటవి. నిద్రలేవగానే అవి మాయమౌతవి. అదేవిధంగా మన మనస్సులలో గల సంకల్పాలే ఈ జగత్తు జనించటానికి

కారణమవుతుందన్నట్లు అర్థమగుతుంది. కనుక వివిధమైన సంకల్పాలే జగత్కారణం అయి ఉండాలి" ఆవిధంగా విచారణ సాగాలి.

ఇదొక విప్లవాత్మకము, అద్భుతము, అభూతము అయిన విషయం. ముందు మనం మనస్సులో అనుకుంటాం ఈ రోజున ఈ వస్తువు కొందాం అని. మనస్సు సంకల్పం. అది భార్య ప్రేరేపణవలన అయితే, భార్య సంకల్పం. ఆ సంకల్పం వలన కొనటం జరుగుతుంది. కొనటం కర్మ. కనుక సంకల్పజనితం కర్మ. వాటి సమిష్ఠి అంటే అనేక కోట్ల జనుల సంకల్పాల జనితాలు అనేక కోట్ల కర్మలు. ఆ అనేక కోట్ల కర్మల సమిష్ఠే జగత్తు. ఛిట్‌ఫండ్‌లో లేక డిపాజిట్‌లో డబ్బువేశాం. అది సంకల్ప జనితకర్మ. ఆ బాంకు దివాలా తీసింది. డబ్బుపోయింది. జ్ఞానోదయమైంది. ఆశకుపోయి అజ్ఞానంతో ఆ సంకల్ప జనిత కర్మ చేశాము అని జ్ఞానోదయమైనంతనే అజ్ఞానం జ్ఞానంలో లయమైంది. సమిష్ఠిలో అదేవిధంగా అజ్ఞానజనితము, సంకల్ప జనితము సమావిష్టము అయిన జగత్తు జ్ఞానంతో లయమౌతుంది. Calculus చదివేవారికి తెలుస్తుంది. Differentialను integrate చేస్తే సమిష్ఠి వస్తున్నది. అదేవిధంగా జగత్తు. మహాభారతంలో సంకల్పమే అజ్ఞానానికి కారణమౌతుందన్న ఒక ఇతిహాసం కూడా ఉన్నది. సంకల్పశీలుడై నానా కష్టాలు పడి కొంతధనం సంపాదించి ఒక బ్రాహ్మణుడు ఒక మంచి ఎద్దుల జతను కొనుక్కుంటే అవిరెండూఒకదానినొకటి పొడుచుకొని చచ్చిపోయినవి. సంకల్పమా! నాకు జ్ఞానబోధ చేశావు! అని ఆ బ్రాహ్మణుడు విచారిస్తాడు.

సం : ఏతయోర్యదుపాదేన మేకం సూక్ష్మం సదవ్యయం
యదైవ మృద్ఘటాదీనాం విచారః సోయమీదృశః 15

అహమేకోపి సూక్ష్మశ్చ, జ్ఞాతాసాక్షీ సదవ్యయం
తదహం నాత్ర సందేహో, విచారః సోయమీ దృశః 16

తెలుగు : మృద్ఘటాదులవలె నుపాదా
నము జగానికి సూక్ష్మమ వ్యయ
మేకమగు సద్వస్తువనున
ట్లా విచారవిధుల్ 15

అట్టి సూక్ష్మ సదవ్యయుండను
జ్ఞాత, సాక్షిని, నేన - తథ్యము
లేదు సందియమనెడు నట్టివె
యా విచారవిధుల్ 16

వ్యాఖ్య : కాని, కుండకు మట్టి ఉపాదానకారణం వలెనే, ఈ సంకల్పాలకీ, సంకల్పజనిత అజ్ఞానానికీ, వేరు ఉపాదానకారణ మొకటి ఉండాలికదా? కాని అటువంటిదేదీ కంటికి గాని, ఇతర ఇంద్రియములకుగాని, గోచారం కావటంలేదు. కనుక అదొక సూక్ష్మమై ఇంద్రియగోచరము కాని వస్తువైయుండవలెను. అది మాయకాదు. సత్యమైనది, శాశ్వతమైనది,

పూర్ణమైనది, అఖండమైనదీ ఒకటే అయి ఉండాలి. ద్వితీయమైనది లేకుండా క్రిందటి శ్లోకంలో అజ్ఞాన జనితమైన జగత్తు జ్ఞానంలో లయమౌతుందని తెలుసుకున్నాము. ఈ జగత్తు అంటే ప్రపంచకమే కాదు, ప్రపంచకంలో అన్ని విషయాలు వాటికి వాటికి సంబంధించిన జ్ఞానం కలిగినప్పుడు అవి లయమౌతయ్యని కూడాతెలుసుకున్నాము. కాని, సంకల్పాలు పుడుతూనే ఉంటవి, చస్తూనే ఉంటవి. అదేవిధంగా జగత్తూ పుడుతూనే ఉంటుంది, డిందుతూనే ఉంటుంది. లయమైన తర్వాత మళ్ళీ ఎట్లా పుడుతున్నది. కనుక, ఇంకోటి ఏదో మనకు తెలియని, సూక్ష్మమైన, నిత్యమైన వస్తువేదో ఉండాలి. ఈ విధంగా విచారణ సాగాలి.

నేను ఒకడనే. సూక్ష్మమైన మనస్సుద్వారా జ్ఞాతినే (తెలుసుకున్నవాడినే) అన్నిటికీ సాక్షినే. నేనెరిగినంతవరకు, అవ్యయుడనే. కనుక నేనుకూడా శాశ్వతుడనే. నాశనం లేనివాణ్ణే. కనుక ఆ జగత్కారణమైన సత్యాన్ని నేనే. సందేహంలేదు. అని ఈ విధంగా విచారణ సాగాలి. (జ్ఞాత అంటే ఎరిగినవాడు- ఆత్మ- పరమాత్మ అని ధ్వని)

సంకల్పం నా మనస్సునుంచే వస్తున్నది. అది చచ్చినా ఇంకోటి వస్తున్నది. కనుక ఈ సంకల్పాలు తయారు చేసే యంత్రం (machine) నాకు మటుకు నాలోనే అగోచరంగా సూక్ష్మంగా ఉన్నది. దీని సమిష్టియైన సూక్ష్మపదార్థం 'నేను' అనే ఒక సమిష్టి 'నేను' అన్నమాట. కనుక ఆ 'నేను'ను గురించిన విచారం మన మనస్సులో రేకెత్తాలి.

సం. ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిరావృతః
తయోరైక్యం ప్రపశ్యన్తి, కిమజ్ఞాన మతః పరం ? **17**

ఆత్మానియామక శ్చాన్తర్దేహో బాహ్యా నియమ్యకః
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరం? **18**

తె. ఏకమాత్మ వినిష్కలంబది
దేహ మవయవ సంఘటితమును
రెండు నొకటనుకన్న మరి - య
జ్ఞాన మేముండున్?

ఆత్మ అంతస్స్థిత నియంతయు
బాహ్యమై నియమితము దేహము
రెండునొకటనుకన్న మరి - య
జ్ఞాన మేముండున్?

వ్యాఖ్య : నేనే జగత్ప్రకాశమునకు కారణము అని క్రిందటి శ్లోకములలో చేసిన నిర్ణయము. "నేను" అంటే "నా దేహము" అను అభిప్రాయానికి తావిస్తుందేమోనని తరువాతి శ్లోకములు చెప్పుచున్నారు. ఆత్మ అనేది ఎముకలు, మాంసాదికము లేనిది. ఒక్కటి అద్వితీయము, సూక్ష్మము. దేహము అనేక భాగాలతో, తత్త్వాలతో నిండి యున్నది. ఆత్మ అంతఃస్థితమై, నియామకము చేసేది. దేహము బహిఃస్థితమై నియమింపబడేది. శాసించేవాడు, శాసింపబడేది ఒకటి కాదు. ఆత్మను దేహమనుకొనుటకన్న మించిన అజ్ఞానము లేదు.

ఇక్కడ, అంతఃస్థితం అంటే దేహంలో ఉండేది అని కొందఱు భావించవచ్చు. ఉచి కాదు. సంకల్పాలు మనస్సునుండే ఆవిర్భవిస్తవనీ, ఆ సంకల్పాలు తయారుచేసే యంత్రం, సూక్ష్మమైనది ఒకటుంటుందనీ, అది ఆత్మ అనీ చెప్పుకున్నాము.ఇక్కడ

అంతఃస్థితము అంటే అట్లా మనస్సును నడిపించే సూక్ష్మవస్తువు అన్నమాట. అందుచేతనే అది శాసించేది కూడా. శాసింపబడేది కాదు.

సం. ఆత్మా జ్ఞానమయః పుణ్యో, దేహో మాంసమయో2 శుచిః
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరం ? 19

ఆత్మా ప్రకాశకః స్వచ్ఛో, దేహ స్తామస ఉచ్యతే
తయోరైక్యం ప్రపశ్యన్తి, కిమజ్ఞాన మతః పరం? 20

తె. ఆత్మ పుణ్యు(డు జ్ఞాన పూర్ణు(డు
మాంసకలుషిత మశుచి దేహము
రెండు నొకటనుకన్న మరి - య
జ్ఞాన మేముండున్?

ఆత్మ స్వచ్ఛము కాంతి పుంజము
వెలు(గ(బడు తామసము దేహము
రెండు నొకటనుకన్న మరి - య
జ్ఞాన మేముండున్?

వ్యాఖ్య : ఆత్మ జ్ఞానపూర్ణమైనది, సర్వజ్ఞత కలది. పవిత్రమైనది. దేహము మాంస సంకలితమైనది. అశుచియైనది. రెంటినీ ఒకటిగా భావించుటకన్న అజ్ఞానమేమున్నది ?

సంకల్ప పూరితమైన అజ్ఞానాన్ని పోగొట్టేదీ తనలో లయంచేసుకునేదీ గనుక జ్ఞానమయమైనది. అందుచేతనే సర్వజ్ఞత్వము కలది, పుణ్యమైనది. మూత్ర పురీష మాంస నిష్కలాదుల అశుచి లేదు కనుక పవిత్రమైనది. ఆత్మజ్యోతి దీపించునది, ప్రకాశమునిచ్చునది, స్వచ్ఛమైనది. దేహము అంధకార బంధురము. అది ఆత్మ ప్రసాదించిన ప్రకాశమును కొనునది. రెంటిని ఒకటిగా భావించుటకన్న అజ్ఞానమేమున్నది?

ఆత్మ దీపించునది. అంటే అక్కడ గ్యాస్‌లైటో, బ్యాటరీ లైటో వేసి ఉంటుందని కాదు. కాని, ఆ గ్యాస్, బ్యాటరీ లైట్లు జ్ఞానం, చైతన్యం. ఆత్మలో చేతనత్వమున్నది, దేహావయవాలకు చేతనత్వం కలిగిస్తుంది. అందుచేత ప్రకాశవంతమైనది. దేహమూ, దేహావయవాలూ, జడత్వం కలిగినవి. ఆత్మ కదిలిస్తేనేగాని కదలలేవు. కనుక, ప్రకాశం తీసుకునేది దేహం. కొందఱు సైంటిస్టులు ఈ పనిని మెదడు శాసిస్తుందంటారు. అది భౌతికం. ఆత్మ కదిలించకపోతే మెదడు జడమే. (సైన్సును "విజ్ఞాన" శాస్త్రం అనటం మన దౌర్భాగ్యం. అదొక వస్తు శాస్త్రమే కాని, విజ్ఞాన శాస్త్రం కాదు)

సం. ఆత్మా నిత్యోహి సద్రూపో దేహోఽనిత్యో హ్యసన్మయః
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరం? **21**

తే. ఆత్మ నిత్యము సత్స్వరూపము
నశ్వరా సన్మయము దేహము
రెండు నొకటనుకన్న మరి - య
జ్ఞాన మేముండున్?

వ్యాఖ్య : ఆత్మ నిత్యము, సత్యము. దేహ మనిత్యము, అసత్యము. రెండూ ఒకటేనని భావించుటకన్న మూర్ఖత్వమేమున్నది? దేహము పుట్టినది మొదలు మృత్యువు వరకూ మార్పు చెందుతూ చివరకు నశిస్తుంది. అదే విధంగా విశ్వంలో పుట్టినవన్నీ, కనపడేవన్నీ నశించేవే. "యత్ దృశ్యతి తన్నశ్యతి". దీనిని సమిష్టిగా వ్యవహరిస్తే జగము సర్వమూ నశించేదే. కనుక, దానిని వ్యావహారిక సత్త(సత్+త) అంటాము. పారమార్థికంగా అనిత్యం.

సం. ఆత్మనః తత్ప్రకాశత్వం యత్పదార్థావభాసనమ్
నాగ్న్యాది దీప్తివద్దీప్తిః ర్భవత్యాంధ్యం యతో నిశి **22**

తె. స్వప్రకాశక మగుచు నాత్మ
జగతి పూర్తిగ వెలుఁగఁజేయును
అగ్నిదీప్తులు దీని బోల వా
కపుడు లేకుంటన్.

వ్యాఖ్య : అన్ని పదార్థాలూ, ఇవి ఇవి అని మనకు తెలిసేది [illegible] (ఆత్మయొక్క) ప్రకాశం వలననే. అది అగ్ని, సూర్య, చంద్రాదులిచ్చే ప్రకాశం వంటి ప్రకాశం కాదు. ఆ ప్రకాశాలు సర్వత్ర నిత్యాలు గావు. అవి లేనప్పుడు చీకటి ఉంటుంది. కాని ఆత్మజ్యోతి నిత్యము ప్రకాశవంతమే. అది పూర్ణము. సర్వ వ్యాపకము.

సం. దేహోఽహ మిత్యయం మూఢో ధృత్వా తిష్ఠత్యహో జనః
మమాయమిత్యపి జ్ఞాత్వా, ఘట ద్రష్టేవ సర్వదా 23

తె. ఘటము నాదిది యన్న విధమున
దేహమిది నా దనుచునుందురు
దేహమది నాకన్న వేరని
తెలియదో దానన్ ?

నేను దేహముకన్న వేరని
తెలియు వారును మూఢమతులై
దేహమే నేనన్న రీతిని
చెలఁగు చుండెదరూ.

వ్యాఖ్య : ఈ వస్తువు నాది. ఈ ఘటము నాది. అట్లా, ఇది నాది, అది నాది. అన్నప్పుడు నేను ఆ వస్తువు కన్న వేరు అని అర్థము కదా ! అట్లే ఈ దేహము నాది అన్నప్పుడు నేనీ దేహముకన్న భిన్నుఁడను అని స్పష్టము కదా! ఇది తెలిసియు. ఎఱిఁగిన వారుకూడ మూఢమతులై ఈ దేహమూ, "నేనూ" ఒకటేనని తలచుచుందురు.

ఆశ్చర్యము! - అనగా అవి వేరువేరని తెలిసినవారు కూడా, ఆత్మ, దేహము ఒకటేనన్న భ్రాంతిలో నున్నారు.

ఇంతకుముందు ముముక్షువు, అంటే ప్రపంచ క్షోభనుంచి విముక్తి కోరినవాడు ఆలోచించవలసిన విషయాలను ఒక క్రమరీతిలో ఉద్ఘాటించారు శంకర భగవత్పాదులు. మొదట నేనెవరను? ఎట్లా పుట్టాను? అని ప్రశ్న వేసుకొని సంకల్పాలవలన పుట్టాను, జగత్తుకూడా అట్లాగే పుట్టింది అని సమాధానం చెప్పుకొని, కనుక ఆ జగత్తు అజ్ఞానం వలన పుట్టింది అని తేల్చుకొని, దానికి విరుగుడు జ్ఞానసంపాదన అనే నిర్ణయానికి రావాలి. జగత్తు మళ్ళీ మళ్ళీ పుట్టడానికి నిమిత్తకారణాలు ఏవైనా ఉంటే ఉండవచ్చుగాక. ఉపాదాన కారణం ఒకటి ఉండాలి. అది ఒక సూక్ష్మపదార్థము, అది సమిష్టి అయిన "నేను" అనే నిర్ణయానికి రావాలి. ఆ "నేను" అనేది దేహం కాదు అని స్పష్టీకరించాలి. ఆ తేల్చుకోవటమే జ్ఞానమని చెప్పి, ఆ సూక్ష్మ సమిష్టి "నేను" అనేదే "ఆత్మ" అనీ, అదే "బ్రహ్మము" అనీ, సిద్ధాంతీకరిస్తున్నారు ఆచార్యులు.

నేను దేహాన్ని కాదు అనుకోవటం జ్ఞానం. ఈ క్రింది శ్లోకాల్లో, నేనే బ్రహ్మను - అంటే, ఆత్మను. అని, ఆత్మ లక్షణాలన్నీ నేనేననీ, శంకరులు ఉద్ఘాటిస్తారు. ఇంతకుముందు ఆత్మ స్వరూపం తెలుసుకోవటం గురించి చెప్పారు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" అని ఉపనిషత్ సూక్తం. బ్రహ్మను గురించి తెలుసుకొన్నవాడు బ్రహ్మే అవుతాడు అని. ఈ క్రింది పద్యాలు ఆ బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు తానే బ్రహ్మము అని నిర్ధారించుకొనటానికి దోహదం అవుతాయి.

సం. బ్రహ్మైవాహం, సమః శాన్తః సచ్చిదానంద లక్షణః
నాహందేహో హ్యసద్రూపో, జ్ఞానమిత్యుచ్యతే బుధైః **24**

తె. నేను బ్రహ్మను, సముఁడ, శాంతుఁడ
సచ్చిదానంద స్వరూపుఁడ

నేను కానసద్దేహ మనుటయె
జ్ఞానమండ్రు బుధుల్

వ్యాఖ్య : నేను బ్రహ్మను. అనగా, ఆత్మను. (బ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ కాదు. బ్రహ్మంటే పరబ్రహ్మ. అంటే పరమాత్మ. నేనా పరబ్రహ్మను అని అర్థం.) సముడను. సుఖ దుఃఖాది అన్ని విషయముల పట్లను, సమభావముతో నుండువాడను. శాంతస్వరూపుడను. సచ్చిదానంద లక్షణుడను. (సత్ అనగా సత్యమై, నిత్యమైనది. చిత్ అనగా, చైతన్యము. ఆనందమే పరబ్రహ్మము) ఆత్మ సత్, చిత్, ఆనంద స్వరూపు()డు. అది నేను. నేను అసత్ రూపము. అంటే అసత్యము, అనిత్యము అయిన దేహమును కాను. అని ఇట్లు తలపోసి నిశ్చయించుటే జ్ఞానమని ప్రాజ్ఞులు ఉద్ఘాటించారు.

కనిపించేవి, ఇంద్రియములకు గోచరించేవీ, మనస్సులో భావనలో వచ్చేవీ, అన్నీ నశించేవే గాని, వాటికి చోదకమైన చైతన్యం –"నేను" అనే ఆత్మ – నిత్యమూ ఉండేది, నశించనిది. దాని లక్షణా లీశ్లోకంలో విదితం చేస్తున్నారు శంకరులు. ఆ సూక్ష్మమైన ఆత్మకు ఏ విధమైన ప్రత్యాసక్తి లేదు కనుక సముడు, తప్పొప్పులు లేని శాంతుడు. సత్ - చిత్ - ఆనందములతో, అంటే సత్యముతో, చైతన్యముతో, ఆనందమయుడు. దేహం అసత్యం, అనిత్యం, అచేతనం, అశాంతం కనుక నేను, అనగా ఆత్మ – దేహము కాదు.

సం. నిర్వికారో, నిరాకారో నిరవద్యోఽహ మవ్యయం
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మి త్యుచ్యతే బుధైః .25

నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహ మాతతః
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మి త్యుచ్యతే బుధైః 26

తె. నిర్వికారుఁడ నవ్యయుఁడ నిర
వద్యుఁడ నిరాకారుఁడను నే
నసద్దేహమును కాననుటె
జ్ఞానమండ్రు బుధుల్

నిర్వికల్పుఁడ నిరాభాసుఁడ
నిరామయుఁడ నే నాతతుండను
దేహమును కాననుటయే
జ్ఞానమండ్రు బుధుల్

వ్యాఖ్య : ఎట్టి పరిస్థితులలోనూ, ఏ వికారమునూ, ఏ మార్పునూ, లేనివాడను. ఆకారము లేని వాడను. వర్ణింప నలవికానివాడను. నాశము లేనివాడను. అసత్యము, అనిత్యము, ఐన దేహమును కాను. ఇట్టి నిశ్చయమే జ్ఞానమని ప్రాజ్ఞులందురు.

ఏ వ్యాధులూ లేనివాడను. ఏ దుఃఖములూ లేనివాడను. ఇంద్రియములక గోచరుడను. వికల్పములు అనగా హెచ్చు తగ్గుల మార్పులు లేనివాడను. శాశ్వతుడను. అసత్యము, అనిత్యము అయిన దేహమును కాను. అట్టి నిశ్చయమే జ్ఞానమని ప్రాజ్ఞులందురు.

సం. నిర్గుణో నిష్క్రియో నిత్యో, నిత్యముక్తో2హ మచ్యుతః
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మి త్యుచ్యతే బుధైః 27

నిర్మలో నిశ్చలోనంతః శుద్ధో హ మజరో మరః
నాహం దేహో హ్యసద్రూపో, జ్ఞాన మి త్యుచ్యతే బుధైః 28

తె. నిర్గుణుఁడ నిష్క్రియుఁడ నిత్యుడ
నిత్యముక్తుఁడ నచ్యుతుండను

దేహమసదది కాననుటయే
జ్ఞానమండ్రు బుధుల్

నిర్మలుఁడ నిశ్చలుఁడ శుద్ధుఁడ
అజరుఁడమరుఁడ నే ననంతుఁడ
దేహమసదది కాననుటయే
జ్ఞానమండ్రు బుధుల్

వ్యాఖ్య : నిర్గుణుడను. సత్త్వ రజ స్తమో గుణములేవీ నన్నంటవు. నేను చేసే కర్మలేవీ లేవు. నిత్యముక్తుడను. నన్నెప్పుడూ ఏ బంధములూ అంటవు. సర్వ స్వతంత్రుడను. జారిపోవువాడను కాను. అందరాని వాడను. నాశము లేనివాడను. నిర్మలుడను. పరిశుద్ధుడను. నిశ్చలుడను. చాపల్యము లేని వాడను. అంతము లేని వాడను. జరా మరణములు లేని నిత్యుడను. అసత్యము, అనిత్యము, అగు దేహమును కాను అను నిట్టి నిశ్చయమే అసలైన జ్ఞానమని ప్రాజ్ఞులు స్పష్టీకరించారు.

సం. స్వదేహే శోభనం సన్తం పురుషాఖ్యం చ సంమతమ్
కిం, మూర్ఖ! శూన్యమాత్మానాం దేహాతీతం కరోషి భోః! 29

స్వాత్మానం శృణు మూర్ఖ త్వం శ్రుత్యా యుక్త్యా చ పూరుషం
దేహాతీతం, సదాకారం, సుదుర్దర్శం భవాదృశైః 30

తె. శుభుని సత్త్వుని పూరుషాఖ్యుని
వేదవాక్సమ్మతుని దేహా
తీతు నాత్మ నిటుల మూర్ఖా!
శూన్యమనియెదవు?

క్రుతులు తెలిపెడి నాత్మ దేహా
తీతు(డగు సద్రూప పురుషు(డు
మూర్ఖ! విను నీ బోంట్లు గన స్వీ
యాత్మ దుర్లభము !

వ్యాఖ్య : దేహమూ, ఆత్మ ఒకటే కాదన్నట్లయితే, ఆత్మే లేదన్న శూన్య వాదాన్ని నిరసిస్తూ, శంకరాచార్యులు వేద ప్రమాణాన్ని సూచిస్తున్నారు. "ఓ మూర్ఖుడా! నీ స్వకీయమైన దేహంలోనే, అందమై, శుభదాయకమై, వేద సమ్మతుడై, సద్వర్తనుడైన "పురుషుడు" అనే పేరుగల వాడున్నాడని తెలిసి కూడా, దేహాన్ని మించి ఆత్మ అనేది లేదని ఎందుకనుకుంటావు? (పురుష సూక్తంలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడినది) వేదార్థాన్ని తెలుసుకొని, వివేకంతో, నీలో వున్న పురుషుణ్ణి గుర్తించు. అదే ఆత్మ. అదే దేహాతీతము. బ్రహ్మము. నీ వంటివారికి సులభంగా గోచరం కానిది. కనుక, మూర్ఖా! ఆత్మను గురించి వేదోపనిషత్తులలో చెప్పిన విషయాలను సమగ్రంగా విచారించి, నీలో ఉన్న ఆత్మను తెలుసుకో! (ఇక్కడ 'నీలో ఉన్న ఆత్మ' అనటం అర్థ సౌలభ్యం కోసం. నిజానికి పురుష సూక్తంలో చెప్పబడినట్లు పురుషుడే ఆత్మ)

సం. అహం శబ్దేన విఖ్యాత ఏక ఏవ స్థితః పరః
స్థూలస్త్వనేకతాం ప్రాప్తః కథం స్యాత్ దేహకః పుమాన్ 31

అహంద్రష్టతయా సిద్ధో దేహో దృశ్యతయా స్థితః
మమాయమితి నిర్దేశాత్ కథం స్యాత్ దేహకః పుమాన్ 32

తె. ఏక మాత్రు(డునై "యహం"శ
బ్దాఖ్యు(డౌ పరమాత్మ పురుషు(డు
తత్త్వముల గుమి స్థూల దేహము
పురుషు(డెట్లగును?

అహమనగ ద్రష్టృతయె స్పష్టము
చూడఁబడు దృశ్యంబు దేహము
ద్రష్టకను దేహంపు వస్తువు
పురుషుఁడెట్లగును ?

వ్యాఖ్య : ఏకమాత్రుడై, "అహం" (నేను) అను శబ్దముతో విఖ్యాతుడైన ఆ పరముడే పురుషుడు. స్థూలమై అనేక తత్త్వముల కూటమియైన దేహమాపురుషుడెట్లు కాగలదు? "అహం" అనబడే ఆ పురుషుడు ద్రష్ట – చూచేవాడు. ఇది ప్రత్యక్షము. చూడబడేది, దృశ్యము. చూచేదీ, చూడబడేదీ, ఒకటెట్లా అగుతుంది? దేహము, 'నాది' అనబడునది అది పురుషుడెట్లగును?

ఈ శరీరం నాది, ఈ వస్తువు నాది, అంటున్నాం. అంటే, ఆ వస్తువూ, ఆ శరీరమూ, 'నేను' అన్నదానికన్న భిన్నమేకదా? రెండూ ఒకటి ఎట్లా అవుతవి? "నేను, నాది," అనలేం గదా?

సం. అహం వికారహీనస్తు, దేహో నిత్యం వికారవాన్
ఇతి ప్రతీయతే సాక్షాత్, కథంస్యాత్ దేహకః పుమాన్ **33**

యస్మాత్పర మితి శ్రుత్యా, తయా పురుషలక్షణం
వినిర్ణీతం విమూఢేన కథం స్యాత్ దేహకః పుమాన్ **34**

తే. పూర్ణ మహము, వికారహీనము
దేహమెపుడు వికారయుత మీ
యెఱుక ప్రత్యక్షమ్ము – దేహము
పురుషుడెట్లగును?

పండితులు "యస్మాత్పర" మ్మను
వేదవాక్యము పురుషలక్షణ
మంచు సిద్ధము చేయ, దేహము
పురుషుడెట్లగును?

వ్యాఖ్య : "అహం" అనే పురుషుడు నిర్వికారుడు, పూర్ణుడు, ఏ విధమైన మార్పు లేనివాడు. దేహము ఎప్పటికప్పుడు వికారము (మార్పు) చెందేది. ఈ విషయము అందరికీ తెలిసినదే. అటువంటి దేహము "అహం" అనబడే పురుషుడెట్లగును?

వేదాలలో "యస్మాత్పరం" అని పురుషుని లక్షణము చెప్పబడినది గదా? (శ్వేతాశ్వతరోపనిషత్తు చూ.) సర్వమూ పురుషుడే. అంతకంటె పెద్దగాని, చిన్నగాని, లేదు. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అన్నది పురుషలక్షణ మైనప్పుడు, దేహము పురుష డెట్లవుతుంది?

సం. సర్వం పురుష ఏవేతి సూక్తే పురుష సంజ్ఞితే
అప్యుచ్యతే యతః శ్రుత్యా, కథంస్యాత్ దేహకః పుమాన్ **35**

అసంగః పురుషః ప్రోక్తో బృహదారణ్యకేపి చ
అనంతమల సంశ్లిష్టః కథంస్యాత్ దేహకః పుమాన్ **36**

తె. పురుష సూక్తము నందు తెలియు న
దెల్ల పురుషుఁడటంచు నుక్తము
శ్రుతియె యిటులుండంగ దేహము
పురుషుఁడెట్లగును?

పూరుషుఁడు నిస్సంగుడని ప్రో
క్తమ్ము బృహదారణ్యకంబున

భూరిమల సంశ్లిష్ట దేహము
పురుష(డెట్లగును?

వ్యాఖ్య : పురుష సూక్తంలో గూడా అదే విధంగా, "పురుష ఏవేదగ్ం సర్వం" అని ఉన్నది గదా. సర్వము అంటే విశ్వమంతా ఆ పురుషుడే కదా! కనుక దేహమూ, పురుషుడు ఒకటే ఎట్లాగవుతుంది?

పురుషుడు అసంగుడు అని బృహదారణ్యకంలోగూడా చెప్పబడి ఉన్నది కదా! (4వ అధ్యాయం, 3వ బ్రాహ్మణం - 15 - 16 మంత్రాలు) అంతులేని మలంతో కూడుకొని ఉన్నది దేహం. అది పురుషుడెట్లా అవుతుంది ?

సం. తత్రైవ చ సమాఖ్యాతః స్వయం జ్యోతిర్హి పూరుషః
జడం పరప్రకాశ్యోऽయం కథం స్యాత్ దేహకః పుమాన్ 37

ప్రోక్తోऽపి కర్మకాండేన హ్యాత్మా దేహాద్విలక్షణః
నిత్యశ్చ తత్ఫలం భుంక్తే దేహపాతా దనన్తరమ్ 38

తె. అందె యుదితుండాయె పురుష(డు
స్వప్రకాశ జ్యోతి యనుచును;
పరప్రకాశిత జడము దేహము
పురుష(డెట్లగును?

కర్మ కాండల(గూడ(బ్రోక్తము
ఆత్మ దేహవిలక్షణుండని
నిత్యు(డై తత్ఫలములం గొను
దేహపాతమునన్

వ్యాఖ్య : అదే బృహదారణ్యక ఉపనిషత్తులో పురుషుడు పరంజ్యోతి; హృదయంలో ప్రాణంలో ఉండే ఆత్మజ్యోతియే పురుషుడు అని చెప్పబడినది. (4వ అధ్యాయం, 3వ బ్రాహ్మణం 7వ మంత్రం) స్వయంగా జడమైయుండి, పరులచేత (ఆత్మచేత) ప్రకాశితమయే దేహం పురుషుడెట్లగుట? కర్మకాండలలో కూడా, ఆత్మ దేహముకన్న విలక్షణమైనది, నిత్యమైనది, దేహపాతమైనప్పుడు ఆ కర్మ ఫలము పురుషుడైన ఆత్మకు చెందుతుంది అని చెప్పబడింది. కనుక పురుషుడు దేహమునకు విలక్షణుడు - దేహము పురుషుడు కాదు.

**సం. లింగంచానేక సంయుక్తం చలం దృశ్యం, వికారి చ**
**అవ్యాపక మసద్రూపం తత్ కథం స్యాత్ పుమా నయమ్ 39**

**ఏవం దేహ ద్వయా దన్య ఆత్మా పురుష ఈశ్వరః**
**సర్వాత్మా, సర్వ రూపశ్చ, సర్వాతీతో హ మవ్యయః 40**

**తె. లింగ దేహము ఇంద్రియాత్త వి**
**కార చంచల దృశ్య మవ్యా**
**పక మసద్రూపకము గావున**
**పురుషు( డెట్లగును?**

**ఈ విధంబున స్థూల సూక్ష్మ శ**
**రీరములకు విలక్షణుండగు**
**నాత్మయే పూరుషు(డహం శ**
**బ్దార్థగోచరు(డు**

**ఈ విధంబున నాత్మ పురుషుం**
**డీశ్వరు(డు సర్వాత్మ సర్వా**

తీతు(డును సర్వ స్వరూపు(డ
హం పదాన్వితు(డు.

వ్యాఖ్య : లింగ శరీరం (అంటే స్వప్నావస్థలో మనకుండే సూక్ష్మ శరీరం -ఇది పంచ ప్రాణాలు, పంచ కర్మేంద్రియాలూ, పంచ జ్ఞానేంద్రియాలు, మనసు, బుద్ధి, అనే 17 తత్త్వాలతో ఉన్నది)

ఇది చంచలము, స్వప్నానంతరం, అదృశ్యం, అవ్యాపకము, మార్పులు కలది, కనుక, ఈ సూక్ష్మ శరీరం కూడా పురుషుడు కాదు. కావున పురుషుడు (ఆత్మ) స్థూల, సూక్ష్మ, రెండు శరీరాలకన్న భిన్నమైనది. ఆ పురుషుడే ఈశ్వరుడూ, సర్వాత్మ, సర్వస్వరూపుడు, సర్వాతీతుడు, అవ్యయుడు.

సం. ఇత్యాత్మదేహ భావేన ప్రపంచస్యైవ సత్యతా
యథోక్తా తర్కశాస్త్రేణ తతః కింపురుషార్థతా 41

ఇత్యాత్మదేహ భావేన దేహాత్మత్వం నివారితః
ఇదానీం దేహ భేదస్యహ్యా సత్త్వం స్ఫుటముచ్యతే 42

తే. దేహమాత్మ యటన్న తర్కము
జగతి సత్యత రూఢి( జేయగ
భేదమున పురుషార్థమేమను
ప్రశ్నయుదయించున్

ఇట్లు దేహాత్మత్వ భావము
లాత్మ వైలక్ష్యమున నణగును
దేహభేదాభావసత్యము
నింకవివరింతున్

వ్యాఖ్య : తర్కశాస్త్రంలో ఈ ప్రపంచకం ప్రకృతి పురుషుల సంయోగం వలన సంభవించింది అనీ, పురుషునితో సంగమం కలిగినది కనుక పురుషుని వలెనే ప్రకృతి కూడా నిత్యత్వం ఆపాదింపదగినదేననీ ఉన్నది కనుక, అదే ఆధారంతో ఆత్మ నిత్యమైతే ఆత్మతో సంగత్వం కలిగిన దేహంకన్న ఆత్మ భేదమని చెప్పి, సాధించగలిగిన పురుషార్థం ఏమిటి అనే తార్కికమైన ప్రశ్న ఉదయించవచ్చును. ఇంతకు ముందు చెప్పినదంతా దేహమూ, ఆత్మా ఒకటేనని వాదించేవారికి సమాధానం. ఇకముందు చెప్పబోయేది అస్థిత్వం గలది ఆత్మయొక్కటేనని, దేహమనేది కేవలం మాయ కనుక ప్రత్యేకంగా వేరే లేదని స్థిరపరచటానికి.

సం. చైతన్య స్యైక రూపత్వాత్ భేదో యుక్తో న కర్హిచిత్
జీవత్వం చ మృషా జ్ఞేయం రజ్జౌ సర్పగ్రహో యథా 43

రజ్జ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ
భాతి తద్వచ్చితిః సాక్షాద్విశ్వాకారేణ కేవలా 44

తే. చేతనత్వమె ఏకరూపము
లేదు జీవత్వముల భేదము
రజ్జు సర్పభ్రమయె బహుజీ
వత్వ భావనయు

భ్రాంతి మెయి రజ్జువు క్షణంబున
సర్పమ ట్లగుపించు గతి చై
తన్యమున బాహుళ్య విశ్వా
కార మగుపించున్

సర్పమ ట్లగుపించు రజ్జువు
మార్పు చెందని రీతి కేవల

చేతనత్వము మార్పు చెందదు
విశ్వమెట్లున్నన్

వ్యాఖ్య : చైతన్యం అనేది ఒకటే రూపం. అందులో భిన్నత్వం లేదు. వేరు వేరు జీవుల్లో వేరు వేరు విధాలుగా చైతన్యం కనిపిస్తుంది గనుక చైతన్యం వేరు వేరుగా ఉంటుందనుకోవటం తప్పు. నీరు ఒకటే. అలలు వేరు. బంగారం ఒకటే, ఆభరణాలు వేరు. త్రాడులో సర్పమున్నదన్న భ్రాంతి త్రాడు యొక్క నిజస్వరూపం తెలియగానే, తొలగి పోతుంది. అదే విధంగా, చైతన్యం ఒకటేనన్న జ్ఞానం కలగగానే, జీవత్వం వేరుకావున, చైతన్యం వేరు అనే భ్రాంతి, (అజ్ఞానం) తొలగుతుంది. అదే విధంగా, ఆత్మ వేరు, జీవాలు లేక జీవాత్మలు వేరు అనుకోవటం అజ్ఞానం. పోతన గారు రచించినట్లు "ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక". సూర్యుడు ఒకడే. ఒక్కొక్కడికి ఒక్కొక్కడుగా తోస్తాడు. చైతన్యం, ఆత్మ ఒకటే, ఒక్కక్కడికీ ఒక్కొక్క విధంగా తోచవచ్చు. అది అజ్ఞానం. త్రాడును పాము అనుకొన్నప్పుడు కాని, కాదని తెలిసినప్పుడు గాని, త్రాడులో ఏ మార్పూ లేదు. అదే విధంగా జీవత్వం విశ్వాకారమనుకునే అజ్ఞానం అంటే విశ్వం వేరువేరు జీవత్వాలు కలిగి ఉన్నది కనుక చైతన్యం విశ్వపు ఆకారమనుకునే అజ్ఞానం. అది కాదని జ్ఞానం కలిగినప్పుడు తొలగిపోతుంది

సం. ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణో న్యత్ర విద్యతే
తస్మా త్సర్వ ప్రపంచోఽయం బ్రహ్మైవాస్తి న చేతరత్ **45**

వ్యాప్యవ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతి శాసనాత్
ఇతి జ్ఞాతే పరే తత్త్వే, భేదస్యావసరః కుతః **46**

తె లేడుపాదానంబు జగతికి
బ్రహ్మ కతిరిక్తమ్ము(గావున

విశ్వమంతయు బ్రహ్మమే, యిత
రంబు లేదెందున్

శ్రుతులు సర్వమ్మాత్మయను శా
సనము చేసినవగుట వ్యాప్య
వ్యాపకత్వము లందు మిథ్యా
భావముదయించున్

వ్యాప్యవ్యాపక కార్యకారణ
ములను మిథ్యగ నెఱుఁగ, పరత
త్త్వంబు నంది క భేదభావన
కేమి యవసరము?

వ్యాఖ్య : ప్రపంచానికి పరబ్రహ్మమే ఉపాదాన కారణము. కార్యకారణాలకు భేదముండదు. ఎందుచేతననగా, ఒక కార్యమునకు ఒక కారణము తప్పదు. ఆ కారణం లేకపోతే కార్యం లేదు. బంగారం లేకపోతే ఆభరణాలు లేవు. అంటే, ఆభరణాలంటే బంగారమే. అదే విధంగా ఉపాదాన కారణమైన పరబ్రహ్మము వలననే విశ్వము కలుగుతున్నది. కనుక విశ్వమంతా పరబ్రహ్మమే కాని, వేరొకటి కాదు. ఇది స్పష్టము. శాసనాలే, అంటే వేదోపనిషత్తులే – విశ్వము సమస్తము బ్రహ్మయే కనుక, ఈ రెంటికీ మధ్య వ్యాప్యవ్యాపక భావాలు వేరుగా చూడటం మిథ్య అని చెపుతున్నవి. ఉదాహరణకు బృహదారణ్యకంలో 4వ అధ్యాయం 5 వ "బ్రాహ్మణం = సర్వం వేదేదం బ్రహ్మేదం..." అన్న 94వ శ్లోకమూ. వ్యాఖ్య చూడదగినవి.

సం. శ్రుత్యా నివారితం నూనం నానాత్వం స్వముఖేన హి
కథం భాసో భవేదన్యః స్థితే చాద్వయ కారణే **47**

తె. విను ముపాదానము, నిమిత్తము
కారణంబులు రెండు – బ్రహ్మమె;
బ్రహ్మ మద్వయ కారణం బీ
విశ్వమునకెల్లన్

శ్రుతియు నానాత్వము నివారణ
చేసె స్వయముగ(గాన నద్వయ
మైన యాత్మకు నితరభావము
లెట్లు భాసిల్లున్?

వ్యాఖ్య : బృహదారణ్యకోపనిషత్తులో "ఇమాని భూతానీదగ్ం సర్వం యదయ మాత్మా" అని అంతా బ్రహ్మమే, అంతా ఆత్మయేనని చెప్పబడినది కదా. ఈ విధంగా శ్రుతియే ప్రపంచము, ఆత్మ వేరు వేరన్న భావాన్ని నివారితం చేసింది. కార్యకారణ రూపంలో పరబ్రహ్మ అద్వితీయమైనప్పుడు, ఆత్మ వేరని, జగత్తు వేరని, వేరైవ జగత్తునకాత్మ కారణమనీ ఎట్లాగవుతుంది? రెండూ పరబ్రహ్మ స్వరూపమే.

తర్క శాస్త్రంలో ప్రకృతికి విశ్వానికి కూడా నిత్యత్వం ఆపాదింపదగినదన్న వాదానికి (41వ శ్లోకం) సమాధానంగా, ప్రకృతి, ఆత్మ, రెండూ పరబ్రహ్మస్వరూపమేననీ, కాబట్టి వైరుధ్యం లేదనీ నిరూపించటానికి 43 వ శ్లోకం నుంచి చెప్పబడుతున్నది.

సం. దోషోఽపి విహితః శ్రుత్యామృత్యోర్మృత్యుం స గచ్ఛతి
ఇహ పశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః 48

తె. భేద దృష్టిని(గలు(గు దోషము
శ్రుతియె విదితము(జేసె నానా
త్వమును గాంచెడి నరుడు మాయా
వంచితు(డనంగన్

నరు(డు మాయా వంచితుండై
మృత్యువును, సంసారమును వెస
మరల మృత్యువు మరల పుట్టుక
చెందుచుండు నిలన్

వ్యాఖ్య : అదే బృహదారణ్యకోపనిషత్తులో "మనసైవానుద్రష్టవ్యం నేహనానాస్తికించనా,, మృత్యోఃన మృత్యుమాప్నోతి య యిహనానేవ పశ్యతి" అని ఉన్నది.(4 వ అధ్యాయం. 4 వ బ్రాహ్మణం) మాయవలన మోసపడి మాత్రమే నరుడు ప్రపంచానికి పరబ్రహ్మకు నానాత్వం చూస్తున్నాడు. అట్లా నానాత్వం చూచేవానికి మృత్యువునుండి మోక్షం లేదు. ఒక మృత్యువునుండి ఇంకొక మృత్యువునకు, ఒక జన్మనుండి వేరొక జన్మకు వెళ్తుంటాడు. భాగవతంలో పోతనగారి పద్యం: "అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయ ప్రమత్తులై, చచ్చుచు పుట్టుచున్ మరల చర్విత చర్వణు లైనవారికిన్....." కూడా అన్వయించుకొనవచ్చును.

సం. బ్రహ్మణః సర్వ భూతాని జాయన్తే పరమాత్మనః
తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీ త్యవధారయేత్ **49**

బ్రహ్మైవ సర్వ నామాని రూపాణి వివిధాని చ
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శ్రుతిర్జగౌ **50**

తె. బ్రహ్మమగు పర మాత్మనుండియె
సర్వ భూతము లుద్భవించును
కాన దృశ్యము లన్నియును బ్ర
హ్మ స్వరూపములె

బ్రహ్మయె ధరియించు వివిధము
లైన రూపము, లెల్ల నామము

లెల్ల కర్మము లంచు వేదమె
వ్యక్త మొనరించెన్

వ్యాఖ్య : అన్ని భూతాలూ పరమాత్మయైన బ్రహ్మమునుండే పుట్టినవి. కాబట్టి అవన్నీ కూడా ఆ పరబ్రహ్మమేనని సిద్ధాంతీకరించుకోవాలి. "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై ఎవ్వనియందు ఉండు" అదే బ్రహ్మము, తైత్తరీయోపనిషత్తు, భృగుపల్లి- 1 అనువాకం గూడా ఇదే ఉద్ఘాటిస్తున్నది. అన్ని పేర్లతోనూ, అన్ని రూపాలతోనూ ఉండేది పరబ్రహ్మమే. అన్ని కర్మలను సమగ్రంగా భరించేది పరబ్రహ్మమే.

సం. సువర్ణా జ్జాయ మానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ 51

స్వల్పమప్యన్తరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః
యః సంతిష్ఠంతి మూఢాత్మా భయం తస్యాభిభాషితం 52

తె. హేమ భూషలయందు నిత్యము
హేమమేయగురీతి బ్రహ్మో
త్పన్న విశ్వములోన బ్రహ్మ
త్వమ్మె శాశ్వతము

ఇంచుకైనను భేదమును జీ
వాత్మ పరమాత్మలకు నడుమను
జూచు మూఢునకే భయంబని
వేదములు పలికెన్

వ్యాఖ్య : సువర్ణంతో చేసిన ఆభరణాలలో శాశ్వతంగా ఉండేది బంగారమే. అదే విధంగా బ్రహ్మమునుండి సర్వభూతములలోనూ శాశ్వతంగా ఉండేదీ బ్రహ్మమే. జీవాత్మ పరమాత్మల మధ్య ఏ కొంచమైనా భేదము చూచేవాడు మూఢుడు. ద్వైత భావం వలననే భయం ఉంటుంది. జ్ఞానికి భయముండదు. ఇది తైత్తిరీయోపనిషత్తులో కూడ వ్యక్తము. (ఆనందవల్లి - 7వ అనువాకం)

సం. యత్రాజ్ఞానాద్ భవేద్ ద్వైతం ఇతర స్తత్ర పశ్యతి
ఆత్మత్వేన యదా సర్వం నేతరస్తత్ర చాణ్వపి **53**

యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః
నవైతస్య భవేన్మోహో న చ శోకో ద్వితీయతః **54**

తె. సర్వ మాత్మత్వముగ(జూచెడు
జ్ఞాని కితరము గోచరింపదు
ద్వైతభావము చేత నజ్ఞాం
డితరములు చూచున్

సర్వ భూతము లాత్మభావము
తోడ(జూచిన జ్ఞానికెప్పుడు
నద్వితీయత(జేసి, కలుగవు
శోకమోహమ్ముల్.

వ్యాఖ్య : అజ్ఞానం వలననే ద్వైత భావం కలుగుతుంది. అంటే, తను కాక వేరొక వస్తువున్న భావం కలుగుతుంది. సర్వము ఆత్మ, తానే ఆత్మ, అన్న భావం కలిగినవానికి ఇతరమేమీ కనిపించదు. అంతా తానుగానే ఉన్నపుడు ఇతరము కనుపించదు కదా! ఆ స్థితిలో ఇతరులెవరూ లేరు కనుక మోహం గాని భయం గాని, శోకం గాని ఉండదు. అదే విషయం ఈశావాస్యంలో కూడా వివరింపబడ్డది.

"యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః, తత్ర కా మోహః కః శోక ఏకత్వమనుపశ్యతి" అని.

సం. అయమాత్మా హి బ్రహ్మైవ సర్వాత్మకతయా స్థితః
ఇతి నిర్ధారితం శ్రుత్యా బృహదారణ్య సంస్థయా 55

అనుభూతోఽప్యయం లోకో వ్యవహార క్షమోఽపిసన్
అసద్రూపో యథాస్వప్న ఉత్తర క్షణ బాధతః 56

తే. అయ్యె నిర్ధారితము బృహదా
రణ్య కోపనిషత్తునను స
ర్వాత్మకంబగు బ్రహ్మమే ఈ
యాత్మ యంచనగన్

లోక మనుభవసిద్ధమై వ్యవ
హార యోగ్యంబయ్యు స్వప్నము
లోనియనుభవ మట్టులది మి
థ్యా స్వరూపంబే.

వ్యాఖ్య : బృహదారణ్యక ఉపనిషత్తులో గూడా "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" - ఈ ఆత్మయే సర్వము, బ్రహ్మము అని నిర్ధారింపబడినది. (2వ అధ్యాయం 5వ బ్రాహ్మణం, 19వ మంత్రం.)

అనుభవానికీ, లౌకిక వ్యవహారానికి, ఈ ప్రపంచం యోగ్యంగా కనుపించినా, మరుక్షణంలోనే మాయమయ్యే స్వప్నం వంటిది. స్వప్నంలోని విశేషాలు స్వప్నంలోనే అనుభవించి స్వప్నం పోగానే అవి మిథ్య అని తెలుసుకుంటున్నాము. అదే విధంగా ప్రాపంచిక అనుభవాలు స్వప్నంలో వలెనే అనుభవిస్తాము. దేహత్యాగం అయిన

తర్వాత ఆ ప్రాపంచిక అనుభవాలన్నీ మిథ్య క్రింద వ్యవహరించవలసినదే కదా? అందుచేతనే స్వప్నంవలె ప్రపంచం కూడా మిథ్య.

సం. స్వప్నో జాగరణేఽలీకః స్వప్నే పి నహి జాగరః
ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యు భయోర్నచ **57**

త్రయమేవం భవేన్మిథ్యా గుణత్రయ వినిర్మితమ్
అస్య ద్రష్టా గుణాతీతో నిత్యో హ్యేకశ్చిదాత్మకః **58**

తే. స్వప్నమున జాగృతియె యుండదు
జాగరంబున స్వప్నముండదు.
రెండు లేవు సుషుప్తిలో మరి
రెంట లేదదియున్

మూ(డు గుణముల కల్పితంబగు
మూ(డవస్థలు మిథ్యయేయగు
ఆత్మ వీనిని( జూచుచుండును
సాక్షిభూతంబై.

ద్రష్టయగు నీ యాత్మ త్రిగుణా
తీతు( డును కేవలము సాక్షియు
నద్వితీయు(డు చిత్స్వరూపు(డు
నిత్యు(డై వెలు(గున్

వ్యాఖ్య : మేలుకొని ఉన్నప్పటి అనుభవాలు స్వప్నంలోనూ, స్వప్నంలోని అనుభవాలు జాగృతిలోనూ ఉండవు. కనుక అవి అసత్యాలు. సుషుప్తి (గాఢనిద్ర) లో రెండూ ఉండవు. రెంటిలోనూ సుషుప్తి ఉండదు. కనుక, ఈ మూడు అవస్థలు అసత్యాలు.

అవి సత్వ, రజ, స్తమోగుణాలనే మూడు గుణాలవలన పుట్టుతవి. ఆ మూడు గుణాలకూ అతీతమై నిత్యమై ఉండేది ఆత్మ ఒక్కటే. ఆత్మ ద్రష్ట. సర్వ సాక్షి. అన్ని గుణాలకూ అతీతము.

ప్రపంచం కూడా ఈ గుణత్రయం వలన పుట్టిందే. కనుక అది కూడా జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థల వలె అసత్యమే. మిథ్యయే అని నిర్ధారణ.

సం. యద్వన్మృది ఘటభ్రాంతిం శుక్తౌవా రజతస్థితమ్
తద్వత్ బ్రహ్మణి జీవత్వం భ్రాన్త్యా పశ్యతి న స్వతః 59

యదామృది ఘటో నామ కనకే కుండలాభిధా
శుక్తౌహిరజత ఖ్యాతి ర్జీవశబ్ద స్తథాపరే 60

తె. మట్టిలో ఘటమన్న భ్రాంతియు
శుక్తిలో రజతంపు భ్రాంతియు
బోలె బ్రహ్మములోన జీవ
త్వంపు భ్రాంతియగున్

మృత్తికకు ఘటమన్న నామము
స్వర్ణమున కుండల ప్రసిద్ధియు
శుక్తిలో రజతంపు ఖ్యాతియు
వ్యావహారికముల్.

ఆ విధంబున జీవ శబ్దము
వ్యావహారిక మాయె నాత్మకు
భ్రాంతి చేతనెగాని కాదది
స్వతస్సిద్ధమ్ము.

వ్యాఖ్య : కుండ మట్టితోచేసినదైనా, ఆ మట్టిని కుండగా చూడటం లేదా త్రాడును సర్పంగా చూడటం, ముత్యపు చిప్పలో మెరుగును వెండిగా చూడటము ఏ విధంగా భ్రాంతి మంతమో, అదే విధంగా బ్రహ్మలో జీవత్వం చూడటం గూడా భ్రాంతియే(గాని, అది స్వతఃసిద్ధముగాదు. ఆత్మయే స్వతఃసిద్ధము. మట్టిని కుండ అనటం, బంగారానికి కుండలాలనటము, శుక్తిని రజతము అనుకొనటము, వ్యావహారికము. అదే విధముగా జీవత్వము ఆత్మకాపాదించటం వ్యావహారికం. స్వతఃసిద్ధము కాదు.

సం. యథైవ వ్యోమ్ని నీలత్వం యథానీరం మరుస్థలే,
పురుషత్వం యథా స్థాణౌ తద్వద్విశ్వం చిదాత్మని. **61**

యథైవ శూన్యే వైతాలో గంధర్వాణాం పురం యథా
యథాకాశే ద్విచంద్రత్వం తద్వ త్సత్యే జగత్ స్థితిః **62**

తె. గగన సీమను నీల వర్ణ; మె
డార్ల జలమును; స్థాణువున పురు
షత్వమట్లు చిదాత్మలో వి
శ్వంబు కల్పితము.

శూన్యమున బేతాళులును గం
ధర్వ నగరం బన్న రీతిని
జగతి మిథ్యాకల్పనం బా
సత్స్వరూపునకు.

ఆకసంబున చంద్రు లిద్దరు
కానుపించెదరన్న రీతిని
జగతి మిథ్యాకల్పనం బా
సత్స్వరూపునకు.

వ్యాఖ్య : నీలత్వం స్వతఃసిద్ధం కాక పోయినా ఆకాశం నీలంగానూ, నీరు లేకపోయినా ఎడారిలో నీరు, జడమైన మొండెంలో జీవంగల మనుష్యత్వము ఉన్నట్లుగా, మన భ్రాంతి వలన ఏ విధంగా కనుపిస్తాయో, అదే విధంగా చిదాత్మలో విశ్వం భ్రాంతము అవుతుంది. ఏ విధంగా, శూన్యంలో భూతాలూ, గంధర్వపురమూ, ఆకాశంలో ఇద్దరు చంద్రులూ, లేనివి ఉన్నట్లు మన మనస్సు భ్రాంతమవుతుందో, అదే విధంగా సత్య స్వరూపమైన ఆత్మలో విశ్వం (ప్రపంచం) ఉన్నట్లు భ్రాంతి కలుగుతున్నది. ఊహింపబడుతున్నది.

సం. యథా తరంగకల్లోలై ర్జలమేవస్ఫురత్యలమ్
పాత్ర రూపేణతామ్రం హి బ్రహ్మాండౌఘై స్తథాత్మతా 63

ఘటనామ్నా యథా పృథ్వీ పట నామ్నా హి తన్తవః
జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్తదభావతః 64

తే. అలలచే జలభావమును పా
త్రల స్ఫురించును తామ్ర భావము
నట్లె బ్రహ్మాండములచే నా
త్మత్వ భావనమున్.

ఘట పటాఖ్యల మట్టి, దారము
తెలియునట్లె జగంబు పేరున
చిత్స్వరూపుడు వెలుగు త త్త ద
భావనా స్థితిచే.

వ్యాఖ్య : వివిధ ప్రకారాలైన కల్లోల తరంగాల బట్టి నిజమైన జలాన్ని ఏ విధంగా తెలుసుకుంటామో, పాత్రల వలన రాగిని ఏ విధంగా తెలుసుకుంటామో, కుండను బట్టి మట్టిని ఏ విధంగా తెలుసుకొంటామో, ఏ విధంగా వస్త్రాన్ని బట్టి దారాలను

తెలుసుకొంటామో, అదే విధంగా బ్రహ్మాండాలను, ప్రపంచాన్ని బట్టి చిత్స్వరూపుడైన ఆత్మయొక్క భావన కలుగుతుంది.

బ్రహ్మాండౌఘాలన్నారు గనుక బ్రహ్మాండము ఒకటి కాదనీ, అనేకాలున్నాయనీ, వేదకాలం నుంచీ మనకు తెలిసిన నిజాన్ని శంకరులు వ్యక్తం చేస్తున్నారు. పాశ్చాత్య శాస్త్రవేత్తలు ఇది ఈ మధ్యనే తెలుసుకున్నారు. బైబిలులో అయితే అసలేమీ లేదు. ప్రపంచమే క్రీస్తుకు పూర్వం నాలుగు వేల సంవత్సరాల పూర్వం పుట్టిందని అందులో ఉద్ఘాటింపబడింది.

సం. సర్వోఽపి వ్యవహారస్తు బ్రహ్మణః క్రియతే జనైః
అజ్ఞానాన్న విజానన్తి మృదేవ హి ఘటాదికమ్ **65**

కార్య కారణతా నిత్య మాస్తే ఘట మృదో ర్యథా
తథైవ శ్రుతి యుక్తిభ్యాం ప్రపంచ బ్రహ్మణోరిహ **66**

తే. ఎల్ల పనులును జరుగు బ్రహ్మము
వలన నని యజ్ఞాను లెరుగరు
కుండ మెచ్చెడి వార లడుసును
మెచ్చుకున్నట్లు.

కార్య కారణ పరత తథ్యము
అడుసు ఘటమున కున్న రీతిని
బ్రహ్మ జగతికి హేతువంచును
శ్రుతులు తెలిపెడిని

వ్యాఖ్య : ప్రపంచములోని వ్యవహారములన్నీ బ్రహ్మము యొక్క శక్తి వలననే జరుగుచున్నవి. మనం కుండ చేయటానికి మట్టినే ఉపయోగిస్తాం గనుక, మట్టియొక్క

శక్తి తోనే కుండ నిర్మించబడుచున్నది. అదే విధంగా ప్రపంచానికి ఉపాదాన కారణమైన ఆత్మ చేతనే విశ్వం కలుగుతున్నది. అదే విధంగా అన్ని వ్యవహారాలూను. అజ్ఞానముచేత జనులిది ఎఱుగరు. కారణాలలో ఉపాదాన కారణం నిత్యం. మారనిది. రెండవది నిమిత్త కారణం. కుమ్మరి, కుండ, మర, మొదలగునవి నిమిత్త కారణాలు. కాని, మట్టి లేకపోతే కుండే లేదు. కాని, ప్రపంచానికి ఉపాదాన కారణమూ, నిమిత్త కారణమూ, రెండూ పరమాత్మయే. "సర్వంఖల్విదంబ్రహ్మ" (అంతా బ్రహ్మమే) అని శ్రుతులు - అంటే ఉపనిషత్తులు - ఘోషిస్తున్నవి. అది కుండ, వస్త్రం, ఆభరణాలు మొదలైన ఉదాహరణాలవలన గూడా గోచరిస్తున్నది.

సం. గృహ్యమాణే ఘటే యద్వత్ మృత్తికా భాతి వై బలాత్
వీక్ష్యమాణే ప్రపంచేఽపి బ్రహ్మైవాభాతి భాసురమ్ **67**

సదైవాత్మా విశుద్ధోఽపి హ్య శుద్ధో భాతి వై సదా
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్ **68**

తే. ఘటము( జూచెడి వాని కందలి
యడుసు భాసించెడి విధాన జ
గంబు(జూడ(గ స్వప్రకాశ
బ్రహ్మ భాసించున్.

రేయి(జీకటి రజ్జు వెఱి(గిన
వానికది త్రాడుగనె కన్పడు
ఎఱుకలేని మనుష్యునకునది
సర్పమని తోచున్.

ఆ విధంబున నాత్మ జ్ఞానికి
నిత్యశుద్ధము గానె కన్పడు

అజ్ఞానకు కనుపింపదందలి
శుద్ధతా గుణమున్.

వ్యాఖ్య : కుండను చూచినప్పుడూ, తాకినప్పుడూ అందులో నున్న అడుసు విషయం భాసిస్తుంది. అదే విధంగా ప్రపంచం చూచి ఆలోచించేవానికి అది నిత్య విశుద్ధమైన బ్రహ్మముగానే భాసించుతుంది. చీకటిని ఇది చీకటి అని తెలిసినవానికి ఆ చీకట్లో త్రాడు త్రాడుగానే కనిపిస్తుంది. తెలియని వానికి పాముగా కనిపిస్తుంది. అదే విధంగా, జ్ఞానులకు ఆత్మ శుద్ధమైన ప్రకాశంగా కనిపిస్తుంది. తెలియని వానికి అవిశుద్ధంగా కనిపిస్తుంది.

సం. యథైవ మృణ్మయః కుంభ స్తద్వద్దేహోఽపి చిన్మయః
ఆత్మానాత్మ విభాగోఽయం ముధైవ క్రియతే బుధైః 69

తె. మృణ్మయము కుంభంబు పోలిక
చిన్మయము దేహమ్మటయ్యును
భేద మాత్మానాత్మలకు నెం
చుటయు వ్యర్థమ్ము

వ్యాఖ్య : ఏ విధంగా కుండ మట్టితో కూర్చబడినదో, అదే విధంగా దేహం చైతన్యంతో కూర్చబడింది. చైతన్యము సత్యము. కనుక శరీరాన్ని ఈ సత్యమైన చైతన్యం నుంచి వేరు చేయలేము. అందుచేత, ఆత్మ, అనాత్మ అనే భేదాలను చూడటం అనవసరం. (ఇదివరలో జడమైనది దేహము, చైతన్యవంతమైంది ఆత్మ, కనుక దేహము, ఆత్మ ఒకటి కాదని చెప్పినది, ఆత్మ అంటే దేహమేనని భావించే వారి భావనను పోగొట్టటం కోసం. కాని, ఇప్పుడు చెప్పేది దేహము గూడా చిన్మయమేనని. అందుచేత చైతన్యము నుంచి వేరుగా చూడనవసరము లేదన్న తర్కసూత్రానికి వివరణము)

దీనివలన దేహము, ఆత్మ ఒకటని కాదు చెప్పేది. దేహము కూడా చైతన్యమయము, ఆత్మ మయము అగుటవలన, రెండిటిని విడివిడిగా ద్వైతభావంతో చూడటం వ్యర్థప్రయాస, అని ఉద్ఘాటించటం.

సం. సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా 70

ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేన తన్తవః
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా 71

కనకం కుండలత్వేన తరంగత్వేన వైజలమ్
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా 72

తె. శుక్తి రజతత్వమును సర్ప
త్వమ్ము రజ్జున నిర్ణయింతురు
మూఢులాగతి నాత్మతకు దే
హత్వ మెంచెదరు

మృత్తిక ఘటత్వమును; వస్త్ర
త్వమును తంతుల నిర్ణయించుచు
మూఢులాగతి నాత్మతకు దే
హత్వ మెంచెదరు

కుండలత్వము స్వర్ణమున; జల
మున తరంగత్వమ్ము నెంచుచు
మూఢులాగతి నాత్మతకు దే
హత్వ మెంచెదరు

వ్యాఖ్య : మూఢత్వము చేత (భౌతిక వాదులు) త్రాడును పాముగా, ముత్యపు చిప్పను వెండిగా, మట్టిని కుండగా, దారాలను వస్త్రాలుగా, బంగారమును ఆభరణములుగా, జలమును తరంగములుగా, నెంచుచూ ఆత్మత్వమును దేహత్వముగా చూస్తారు. (అంటే, సత్యాసత్యాలు విచారించకుండా, కనుపించినదే సత్యమనుకునే హేతువాదులు, పై ప్రకారంగా అనుకుంటారు)

సం. పురుషత్వేన* యథా స్థాణుః జల త్వేన మరీచికా
విన్ర్ణీతా విమూఢేన దేహత్వేన తదాత్మతా **73**

గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా
విన్ర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా **74**

తె. స్థాణువులలో పూరుషత్వము
నెండమావుల జలము(జూచెడు
మూఢులా గతి నాత్మతకు దే
హత్వ మెంచెదరు

లోహమున ఖడ్గత్వమును కా
ష్ఠమున గృహభావంబు నెంచెడు
మూఢులాగతి నాత్మతకు దే
హత్వ మెంచెదరు

వ్యాఖ్య : సత్యాసత్య వివేచన జ్ఞానము లేక, కానుపించినదే నిజమని నమ్ము భౌతిక హేతువాదులు మూఢత్వము చేత జడులలో (మొండేలలో) పురుషత్వము (మనుష్యత్వము), ఎండమావులలో జలత్వము, కలపలో గృహత్వము (ద్వారాలు,

---

* చోరత్వేన అని పాఠాంతరం

ద్వారబంధాలు, దూలాలు, వగైరా), లోహములో ఖడ్గత్వమును చూచుచు, అదే విధముగా ఆత్మలో దేహత్వము చూచి, ఆత్మ, దేహము, ఒకటే ననుకుంటారు. కార్యమునే చూడగలుగుతారు గాని, కారణమును చూడలేరు, అజ్ఞానమువలన.

సం. యదావృక్ష విపర్యాసో జలాద్భవతి కస్యచిత్
తద్వ దాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 75

పోతేన గచ్ఛతః పుంసః సర్వం భాతీవ చంచలమ్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 76

తె. జలములో తల క్రిందులై వృ
క్షములు కన్పడునట్టు లజ్ఞా
నంపు వివశత నాత్మలో దే
హత్వ మగుపించున్.

నావలో(జనువాని కంతయు
చంచలం బగునట్టు లజ్ఞా
నంపు వివశత నాత్మలో దే
హత్వ మగుపించున్.

వ్యాఖ్య : చెట్టు ప్రతిబింబాన్ని నీటిలో చూచి, చెట్టు తలక్రిందులుగా ఉన్నదనుకొన్నట్లు అజ్ఞానం మూలమున మానవుడు ఆత్మలో దేహత్వాన్ని చూస్తాడు. చెట్టులో మార్పు లేదు, కాని, నీరు అనే కప్పిన మాయ లేక అజ్ఞానం వలన తలక్రిందులుగా కనపడుతుంది. అదే విధంగా పడవలో వెళ్ళే మానవునకు (ఈ రోజుల్లో రైళ్ళలో, కార్లలో) అన్నీ కదులుతున్నట్లే అగుపించుతవి. ఆ ప్రకారమే అజ్ఞానంలో వున్న మానవునకు ఆత్మలో దేహమున్నట్లు కనపడుతుంది.

సం. పీతత్వం హియథా శుభ్రే దోషాద్భవతి కస్యచిత్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః **77**

చక్షుర్భ్యాం భ్రమ శీలాభ్యాం సర్వం భాతి భ్రమాత్మికమ్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః **78**

తె. పసిరికలలో శుభ్ర వస్తువు
పచ్చనై కనుపించు, న జ్ఞా
నంపు వివశత నాత్మలో దే
హత్వ మగుపించున్

కండ్లు తిరుగగ జగము తిరుగుచు
కానుపించెడు రీతి నజ్ఞా
నంపు వివశత నాత్మలో దే
హత్వ మగుపించున్

వ్యాఖ్య : కండ్ల కామెర్లు, పసరికలు వచ్చినప్పుడు శుభ్రమైన వస్తువులన్నీ పచ్చగా కనపడు రీతిని అజ్ఞాన ప్రభావం వలన మానవుడు ఆత్మలో దేహత్వాన్ని చూస్తాడు. అదే విధంగా కళ్ళు తిరుగుతున్నపుడు, నేత్రాలు చలిస్తున్నపుడు అన్ని వస్తువులూ తిరుగుతున్నట్లు కనపడునట్లే. అజ్ఞాన ప్రభావం వలన మానవుడు ఆత్మలో దేహత్వం చూస్తాడు. అజ్ఞానమనగా ఆలోచనా హీనత. బుద్ధిని కప్పిన మాయ. (అది నిజంగా కర్మ చోదితం). అంటే అజ్ఞానికి ఆత్మ తెలియదు. దేహమే సర్వం అనుకుంటాడు. తానున్న పరిస్థితే నిజమనుకొని నిజమైనవి తెలియకుండా ఉంటాడు.

సం. అలాతం భ్రమణేనైవ వర్తులం భాతి సూర్యవత్
తద్వదాత్మాని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః **79**

సం. మహత్త్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతి దూరతః
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 80

తె. వర్తుల భ్రమణమున(గొరివియు
సూర్యువలె తోచు నటు లజ్ఞా
నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్

భూరివస్తువులన్ని దూరత
నణువులై తో(చునటు లజ్ఞా
నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్

వ్యాఖ్య : మండుతున్న కట్టెను గుండ్రముగా తిప్పుతుంటే సూర్యుని వలె కనపడుతూ ప్రకాశిస్తుంది. అదే విధంగా అజ్ఞానం వలన ఆత్మలో దేహత్వం కనుపిస్తుంది. పెద్ద పెద్ద వస్తువులు దూరంనుంచి చూచుటవలన చిన్నచిన్నవిగా, అణువులుగా కనుపిస్తవి. అదే విధంగా అజ్ఞానం వలన ఆత్మలో దేహత్వం కనుపిస్తుంది. తిప్పుతున్నది కట్టె అని తెలిసి వున్నా, పెద్ద పెద్ద వస్తువులేవో తెలిసివున్నా, కనపడేదే నిజమనే భౌతిక, హేతువాదముల నిష్ణాతులు, నిజం తెలుసుకోవటానికి ఆలోచించరు. జ్ఞానం మీద కర్మ వశాత్తూ మాయ కప్పగా కలిగిన అజ్ఞానంవలన.

సం. సూక్ష్మత్వే సర్వవస్తూనాం స్థూలత్వం చోపనేత్రతః
తద్వదాత్మాని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 81

కాచ భూమౌ జలత్వం వా జల భూమౌ హి కాచతా
తద్వ దాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 82

తె. సూక్ష్మవస్తువులెల్ల భూత
ద్దముల(బెద్దగ తో(చునటు లజ్ఞా
నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్.

కాచభూమి జలత్వమును జల
భూమిఅ కా చత్వమటు లజ్ఞా
నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్.

వ్యాఖ్య : భూతద్దంలో చూడటం వలన చిన్న చిన్న వస్తువులు పెద్దగా కనిపిస్తవి. అదే విధంగా అజ్ఞానం వలన (అజ్ఞానపు దృష్టి వలన) ఆత్మలో దేహత్వం గోచరిస్తుంది. అద్దంవలె నున్నగానున్న భూమి కదలిక లేని నీరుగా కనుపిస్తుంది. అట్లాగే కదలిక లేని నీటి ఉపరితలం అద్దంగా కనుపిస్తుంది. అదే విధంగా అజ్ఞానం వలన ఆత్మలో దేహత్వం కనుపిస్తుంది. కొరియా "పచ్చ సముద్రం" (Yellow Sea) పై వస్తుంటే, ఆ సముద్రం ఒక స్వచ్ఛమైన, విశాలమైన అద్దంగా కనుపించింది. ఇది స్వానుభవం.

సం. యద్వ దగ్నౌ మణిత్వం హి మణౌ వా వహ్నితా పుమాన్
తద్వ దాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 83

అభ్రే షు సత్సుధావత్సు సోమో ధావతి భాతివై
తద్వ దాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 84

తె. అగ్ని కణిక మణిత్వము ను మణి
నగ్ని తో(చెడు యట్టు లజ్ఞా

నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్

చదల మబ్బుల పరువు చంద్రుని
పరువువలె తోచునటు లజ్ఞా
నంపు వశమున నాత్మలో దే
హత్వ మగుపించున్

వ్యాఖ్య : అగ్ని కణాలు మణులు గాను, మణుల ప్రకాశం అగ్నిగాను కనపడునట్లే, అజ్ఞానపు చూపునకు ఆత్మలో దేహత్వము కనుపించును.

ఆకాశంలో పరుగెత్తేవి మేఘాలైనా, వాటి వెనుకనున్న చంద్రుడు పరువెత్తుతున్నట్లు కనపడతాడు. అజ్ఞానపు చూపునకు ఆత్మలో దేహత్వం కనుపిస్తుంది.

సం. యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 85

యథా శశీ జలే భాతి చంచలత్వేన కస్యచిత్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః 86

తె. అధిక మోహము వలన దిగ్భ్రమ
మానవున కగునట్టు లజ్ఞా
నంపు వివశత నాత్మలో దే
హత్వ మగుపించున్

నిశ్చలుఁడు శశి జలములో చం
చలుఁడుగా తోచు నటు లజ్ఞా

నంపు వశమున నాత్మలో దే
హత్వమగుపించున్.

వ్యాఖ్య : కళవళికలో దిక్కులనే తప్పుగా చూస్తారు కొందరు. అదేవిధంగా అజ్ఞానంతో ఆత్మలో దేహత్వం చూస్తారు. నీటిలో ప్రతిబింబించే చంద్రుడు అలల వలన కదులుతున్నట్లు కనిపించునట్లుగనే అజ్ఞానంతో ఆత్మలో దేహత్వం చూస్తాడు.

70 వ శ్లోకం నుంచీ 86 వ శ్లోకం వఱకు, అజ్ఞానం వలన ఆత్మలో దేహత్వం ఉన్నదనే భ్రమ, అనగా ఆత్మే దేహము కూడా అనే భావం ఏ కారణాలవలన తోస్తుందో 22 ఆరోపిత కార్యాల ఉదాహరణలతో వివరించారు ఆచార్యులు. ఆరోపితమైన వస్తువు అధిష్ఠానము కంటే వేఱుగా ఉండదు. అటువంటి వస్తువును, కార్యాన్ని చూచి, కారణం విచారించక పోవటం వలన, ముఖ్యంగా ఉపాదాన కారణం విచారించకుండటం వలన కలిగే భౌతికవాద ప్రచోదితమైన భ్రమ – అదే అజ్ఞానం – అదే అవిద్య. ప్రపంచానికి ఉపాదానకారణం బ్రహ్మమే, అనగా ఆత్మయే అనీ, ఈ కారణం నిత్యమూ, ఇది కలిగించే రూపాలు అనిత్యాలు కనుక, ప్రపంచం అంతా ఆత్మమయమేనని నిర్ధారణ కలగటం జ్ఞానం. అదే, వెనుక 24 వ శ్లోకంలో కూడా చెప్పారు. ఈ జ్ఞానం కలిగినప్పుడు భ్రమ అనగా అజ్ఞానం, లయమై పోతుంది. ఈ విషయం 87, 88 శ్లోకాలలో వివరిస్తారు.

సం. ఏవ మాత్మన్యవిద్యాతో దేహాధ్యాసో హి జాయతే
స ఏ వాత్మా పరిజ్ఞాతో లీయతే చ పరాత్మని 87

సర్వ మాత్మతయా జ్ఞాతం జగత్ స్థావర జంగమం
అభావాత్ సర్వ భావానాం దేహానాం చాత్మతా కుతః 88

తే. ఇట్ల విద్యాపరత నాత్మకు
దేహ భావము కానుపించుట

లాత్మ విజ్ఞానంబు లోపల
లయము చెందెడిని.

ఈ చరాచర జగము సర్వ
మ్మాత్మమయమని తెలిసి భేదము
లెల్ల బాసిన నాత్మకిఁక దే
హత్వ మెక్కడిదీ?

వ్యాఖ్య : ఆత్మ దేహత్వ భావము (ఆత్మే దేహము, దేహమే ఆత్మ, అన్న భావం) అజ్ఞానం వలన కలుగునది. జ్ఞానము కలుగగనే తొలగిపోతుంది.

ఈ చరాచర జగత్తు సర్వము ఆత్మయేనని, ఆత్మమయమని తెలుసుకొన్నచో, అది అద్వితీయమగుటచే (వేరొకటి లేనిదగుటచే) ఆత్మకు దేహత్వం కాని, దేహానికి ఆత్మత్వం కాని ఆపాదించి భేదం చూచే ప్రశ్నే ఉదయించదు.

సం. ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహామతే
ప్రారబ్ధ మఖిలం భుంజన్నో ద్వేగం కర్తు మర్హసి 89

తె. ఓ మహామతి ! సతత మాత్మ
జ్ఞానమున కాలమ్ము గడుపుచు
క్షోభ గాంచక యుండు ప్రార
బ్ధానుభవము లనన్

వ్యాఖ్య : ఓ మహామతీ ! జ్ఞానీ ! ఆత్మ నిత్యత మననం చేస్తూ, కాలం శుభంగా గడుపు. ఆ విధంగా ప్రారబ్ధకర్మల అనుభవానికి ఉద్వేగపడటం ఉండదు. అన్ని కర్మలూ ఆత్మ ప్రచోదితములేగదా ! కర్మాచరణము తప్పదు. పూర్వ జన్మల కర్మలు, పాప కర్మలయినా సరే, పుణ్య కర్మలయినా సరే, సంచిత కర్మలు. అందులో కొన్ని

ఈ జన్మలో అనుభవానికి వస్తవి. అట్లా ప్రాప్తమయేవి ప్రారబ్ధ కర్మలు. కొన్ని ఈ జన్మలో చేసిన కర్మల, అంటే క్రియమాణ కర్మల, ఫలితాలనే అనుభవిస్తుండ వచ్చును. అనుభవించకపోతే అవి సంచిత కర్మలలో చేరుతవి. కర్మలు అనుభవించక తప్పదు. కాని, ఇదంతా ఆత్మయేనని, ఆత్మ అద్వితీయమని, తెలిసిన వానికి, వాని వలన ఉద్వేగం కాని, కలత గాని, ఉండవు.

ఇంతవఱకు అజ్ఞానము జ్ఞానములో లయమగునని తెలిపి, జ్ఞానము ప్రాప్తమైన వానిని సంబోధిస్తూ ఈ శ్లోకంలో అటువంటి జ్ఞానికి ప్రారబ్ధాది కర్మల వలన క్షోభ కాని, కలత గాని, ఉండవు అని ఉద్ఘాటిస్తున్నారు.

సం. ఉత్పన్నేఽప్యాత్మ విజ్ఞానే, ప్రారబ్ధంనైవ ముంచతి
ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా 90

తె. ఆత్మ తెలివిడి యబ్బినను ప్రా
రబ్ధ మంటియె యుండునను శా
స్త్రముల రీతి నిరాకరణమగు
నింక ముందటను

(జ్ఞానికి ప్రారబ్ధాది కర్మల వలన క్షోభ ఉండదు అని క్రిందటి శ్లోకంలో చెప్పిన దానిని వివరిస్తున్నారు)

వ్యాఖ్య : ఇంతవరకు, శాస్త్రంలో, శరీరం ఉన్నంత వరకు ప్రారబ్ధ కర్మలు అనుభవింపక తప్పదు అని ఉన్నది. శ్రీమచ్ఛంకరాచార్యుల వారు ఆ విచారము నిప్పుడు సరిదిద్దుతారు. కర్మలు శరీరాన్నంటుకొని ఉంటవి గాని, ఆత్మను కాదు. శరీరమనేది ప్రత్యేకంగాలేదనీ, ఆత్మలో దేహత్వం గాని, దేహంలో ఆత్మత్వం గాని వేరుగా లేవనీ, జ్ఞాని తెలుసుకున్నాడు. శరీరమనేదే వేరుగా లేనప్పుడు దానికి అంటుకొనే కర్మలెక్కడుంటవి ? అని ఆది శంకరులు స్థాపించనున్నారు, శాస్త్రంలో ఉన్న విచారణానికి సవరణగా.

సమన్వయ మేమంటే, జ్ఞాని అంటే శరీరంతో వున్నవాడే. వాని శరీరానికి ప్రారబ్ధ కర్మలు తప్పక అంటుకొనే ఉంటవి, శాస్త్రంలో చెప్పినట్లు. కాని, జ్ఞాని ఆత్మ తత్వము తెలిసిన వాడు కనుక, ఆ ప్రారబ్ధాల కర్మలు తనను అంటి వున్నవి అని చూడడు. అందుచేత వాని నంటవు అని అభిప్రాయం.

సం. తత్వ జ్ఞానోదయా దూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే
దేహా దీనా మసత్య త్వాత్ స్వప్నో విబోధితః **91**

తె. తత్వ విజ్ఞానమ్ముచే దే
హాద్యసత్యత వ్యక్తమగు నే
పగిది స్వప్నాసత్య మవగత
మగును మేలుకొనన్

దేహ మెప్పు డసత్యమాయెనొ
అపుడె దేహాలంబితము ప్రా
రబ్ధ మనుగతమగుట కా పయి
తావు లేదెందున్

వ్యాఖ్య : ఆత్మజ్ఞానం లబ్ధమైన తరువాత ప్రారబ్ధం అంటుకొని ఉన్న సంగతి తెలియదు. కనుక జ్ఞానికి జ్ఞానం లబ్ధమైన తరువాత కర్మ అంటదు అని అభిప్రాయం. ఏవిధంగా స్వప్నంలో ఉన్న విషయాలు మేలుకొన్న తరువాత జ్ఞానంలో కరిగిపోతవో అదే విధంగా ఈ ప్రారబ్ధాది కర్మలు గూడా ఆత్మజ్ఞానోదయం తరువాత కరిగిపోతవి, అసత్యమై.

సం. కర్మ జన్మాంతర కృతం ప్రారబ్ధ మితి కీర్తితమ్
తత్తు జన్మాంతరాభావాత్ పుంసో నైవాస్తి కర్హిచిత్ **92**

సం. స్వప్న దేహో యథాధ్యస్త స్తథైవాయం హి దేహకః
అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావే హి తత్కుతః **93**

తె. పూర్వ జన్మాంతర కృతంబగు
కర్మ ప్రారబ్ధంబనంబడు
జన్మ భావము లేని జ్ఞానికి
కర్మలును లేవు

స్వప్నదేహం బెట్లు కల్పిత
మట్లె ఈ దేహంబు నాత్మా
ధ్యస్తమైనది కాన జ్ఞానికి
జన్మమే లేదు

కల్పితంబగు దేహమే యా
లంబనము ప్రారబ్ధకర్మకు
జన్మమే లేకున్న ఇక ప్రా
రబ్ధ మెక్కడిది?

వ్యాఖ్య : జన్మాంతరకృత కర్మ ప్రారబ్ధ కర్మ. జన్మాంతరమే లేని వానికి కర్మ లేదు. స్వప్నంలో కనపడే దేహం వలె, జాగ్రదవస్థలోని దేహం కూడా అధ్యస్తమే. (లేనిది ఉన్నట్లుగా కనపడటం). ఎందుచేతనంటే, సర్వమూ ఆత్మ, దేహము మిథ్య కనుక. జన్మయే లేనప్పుడు కర్మలెక్కడ?

సం. ఉపాదానం ప్రపంచస్య మృద్భాండ స్యేవ కల్పితే
అజ్ఞానం చైవ వేదాన్తైః తస్మిన్నష్టే క్వ విశ్వతా ? **94**

తే. మృత్తు ఘటమున కైన కైవడి
జగతి కజ్ఞానం బుపాదా
నం బటంచు వచించెదరు వే
దాంత కోవిదులు

అట్లు విశ్వమ్మునకు కారణ
మైన యజ్ఞానంబు జ్ఞానము
చే నశించిన, విశ్వమున ప్రా
రబ్ధ మెక్కడిది?

వ్యాఖ్య : మృత్తుక భాండానికి వలె ప్రపంచానికి ఉపాదాన కారణం అజ్ఞానం అని వేదాన్తంలో చెప్పబడ్డది. జ్ఞానంలో అజ్ఞానం లయమై పోతుంది గనుక, అట్లా లయమైనప్పుడింకా అజ్ఞానం ఎక్కడిది, దాని కార్యమైన విశ్వం ఎక్కడిది ? విశ్వానికి అంటి ఉండే కర్మలు ఎక్కడ? ప్రారబ్ధమనేదే ఉండదు. (ఇది 45 వ శ్లోకానికి విరుద్ధంగా కనపడుతుంది).

45 వ శ్లోకంలో "ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణో న్యత్ర విద్యతే" అని వున్నది. ఇందులో ఉపాదానం ప్రపంచానికి అజ్ఞానం అని ఉన్నది. రెండూ అన్యోన్య విరుద్ధంగా కనపడవచ్చు గాని, అజ్ఞానం జ్ఞానంలో లయమైనప్పుడు ఉపాదాన కారణం జ్ఞానమే, బ్రహ్మమే అవుతుంది.

సం. యథారజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వైభ్రమాత్
తద్వ త్సత్య మవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః 95

రజ్జురూపే పరిజ్ఞాతే సర్ప భ్రాంతిర్న తిష్ఠతి
అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచః శూన్యతాం వ్రజేత్ 96

తె. భ్రాంతి వశమున రజ్జు భావము
విడిచి సర్ప భ్రమను గొనుగతి
సత్యమెఱు(గక మూఢమతు లీ
జగము చూచెదరు.

రజ్జు రూపము తెలియ సర్ప
భ్రాంతి తొల(గు నటు లధిష్ఠా
నంబునగు బ్రహ్మమ్ము నెఱిగిన
జగతి శూన్యమగున్.

వ్యాఖ్య : భ్రమతో రజ్జువును సర్పంగా చూచినట్లే ఆత్మ సత్యమెరుగని మూఢ విద్వాంసులు జగత్తును వేరుగా చూస్తారు. త్రాడు యొక్క నిజరూపం తెలియగానే సర్పభ్రాంతి వదలుతుంది. అదే విధంగా సర్వానికి అధిష్ఠాత అయిన ఆత్మ (పరబ్రహ్మము) చూడగానే భ్రాంతి తొలగి ప్రపంచపు మిథ్యాత్వం తెలుస్తుంది. (ప్రపంచమే శూన్యమయినప్పుడు [శరీరమూ శూన్యమే] ఇక ప్రారబ్ధము, కర్మలు ఎక్కడివి?)

సం. దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిః కుతః
అజ్ఞాని జన బోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః 97

క్షీయన్తే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరాపరే
బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యా గీతం చ యత్స్ఫుటమ్ 98

తె. దేహ ప్రాపంచికతచే ప్రా
రబ్ధమున కవకాశ మెక్కడ?
వేద మజ్ఞుల కొఱకె ప్రా
రబ్ధమును బోధించెన్

బ్రహ్మముం గన సర్వకర్మలు
నష్టమగుననె శ్రుతులు గీతయు
కావునను బ్రారబ్ధకర్మ
క్షయము స్ఫుటమాయెన్

వ్యాఖ్య : ముందు చెప్పిన విషయాలను బట్టి ప్రపంచమే మిథ్య అయినప్పుడు దేహం కూడా మిథ్యయే కదా ? అనీ, దేహం మిథ్య అయినప్పుడు ప్రారబ్ధం కూడా మిథ్య అనీ, తెలుస్తున్నది. అయితే శ్రుతులు ప్రారబ్ధం గురించి చెప్పేది కేవలం అజ్ఞానులకు బోధించటానికే. "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే" అన్న వాక్యం, ముండకోపనిషత్తులో కూడా ఉన్నది. పరమాత్మను దర్శించగానే పరాపర భేదం (అంటే ఆత్మా నాత్మ భేదం), సర్వ కర్మలూ, నశిస్తవి. ఇది శ్రుతులలో స్ఫుటంగా ఉన్నది, భగవద్గీతలో కూడా ఉన్నది.

సం. ఉచ్యతేఽజ్ఞై ర్బలాత్ చైతత్తదానర్థ ద్వయాగమః
వేదాంత మత హానిం చ, యతో జ్ఞానమితి శ్రుతిః 99

తె. అజ్ఞతా ప్రాబల్యమున ప్రా
రబ్ధ సంస్థితి నొప్పుకొనుచో,
దాన కలుగును శ్రుతి పరమ్ముగ
రెం డనర్థములు

ఆ యనర్థ ద్వయము మోక్ష
జ్ఞాన నియత శ్రుతి విరుద్ధ
మ్మగుట నద్వైతార్థకములగు
శ్రుతులె గ్రాహ్యములు

వ్యాఖ్య : అజ్ఞులు బలవంతముగా వారిసిద్ధాంతము - జ్ఞానులకు కూడా ప్రారబ్ధ

కర్మము తప్పదన్న వాదము - ఉద్ఘాటిస్తే దానివలన రెండు అనర్థములు కలుగుతవి. ఒకటి : అద్వైత పూరితమైన వేదాంతమతానికి హాని కలుగుతుంది. రెండవది మోక్షమార్గపు టభ్యాసానికి హాని కలుగుతుంది. అనగా జ్ఞానసాధనా ప్రతిపత్తికి హాని కలుగుతుంది. జ్ఞానికి కూడా ప్రారబ్ధం తప్పకపోతే, ఇక జ్ఞాన సాధనమెందుకు? మోక్షమార్గమెందుకు ? అని అనిపించవచ్చు. కనుక, శ్రుతులు చెప్పే అద్వయార్థమే తీసికోవాలి.

సం. త్రి పంచాంగా న్యథో వక్ష్యే పూర్వోక్తస్య హి లబ్ధయే
తైశ్చ సర్వైః సదా కార్యం నిదిధ్యాసన మేవతు 100

నిత్యాభ్యాసాదృతే ప్రాప్తి ర్న భవేత్సచ్చిదాత్మనః
తస్మా ద్బ్రహ్మ నిదిధ్యాసే జిజ్ఞాసుః శ్రేయసే చిరమ్ 101

తే. జ్ఞాన సిద్ధికి నంగములు పదు
నైదు వివరింపంగ(బడుని(క
వానితో నిత్యము నిదిధ్యా
సమును సలుపవలెన్

సచ్చిదానందాత్మ నిత్యా
భ్యాసముననే జ్ఞాతమయ్యెడి
నీ నిది ధ్యాసనము లేక ది
ప్రాప్తి కాకుండున్.

కాన జిజ్ఞాసువు నిరంతర
మీా నిదిధ్యాసమును శ్రేయో
దాయకముగా( జేయవలయును
నియమనిష్ఠలతో

వ్యాఖ్య : ఇంతవరకు జ్ఞానప్రాప్తి లక్ష్యంగా వివరించారు. ఇంక ఆ జ్ఞానం అబ్బటానికి సాధనగా 15 అభ్యాసాలను వివరిస్తారు. వానితో నిదిధ్యాస (అంటే, నిరంతరాభ్యాసం) చేయాలి. ఈ నిదిధ్యాసన లేకుండా జ్ఞానం ప్రాప్తి కాదు. ఈ అభ్యాసాలు ముందు మోక్షమార్గానికి చెప్పిన సాధన చతుష్టయానికి గూడా వర్తింపజేయవచ్చు.

జిజ్ఞాసువు తన శ్రేయస్సుకోసం, ఆత్మజ్ఞానం అబ్బటానికి, చిరకాలం, ప్రయత్న పూర్వకంగా, విఘ్నాలకు లోబడకుండా, బ్రహ్మజ్ఞానాన్ని గురించిన ధ్యానం చేస్తుండాలి. అప్పుడే సత్, చిత్, ఆనందమయ రూపమైన బ్రహ్మము అనుభవమునకు వచ్చేది.

సం. యమోహి నియమ స్త్యాగో మౌనం దేశశ్చ కాలతః
ఆసనం మూలబంధశ్చ, దేహ సామ్యం చ దృక్ స్థితిః 102

ప్రాణ సంయమనం చైవ ప్రత్యాహారశ్చ ధారణా
ఆత్మ ధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగాని వై క్రమాత్ 103

తె. యమనియమములు త్యాగ మౌనము
లాసనము దేశమును కాలము
మూలబంధము దేహసామ్యము
దృక్ స్థితియు పదియున్.

ప్రాణ సంయమనమ్ము ప్రత్యా
హార ధారణములును ధ్యాన
మ్మును సమాధియు ననగ నైదును
వెరశి పదునైదు.

వ్యాఖ్య : ఈ అభ్యాసాలు పదునైదు. అవి, యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృక్ స్థితి,

ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి.

వీటిని గురించిన వివరములు తరువాతి శ్లోకాలలో ఉంటవి. అవి పాతంజల యోగ శాస్త్రంలోనూ, ఛందోగ్యోపనిషత్తులోనూ గూడా సూచితమైనవి.

**సం. సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దింద్రియ గ్రామసంయమః**
**యమోఽయ మితి సంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః 104**

**సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః**
**నియమో హి పరానన్దో నియమాత్ క్రియతే బుధైః 105**

తె. సర్వమును బ్రహ్మ మ్మటంచును
తెలిసి యింద్రియముల నిరోధిం
చుటను యమమం చంద్రు; మరి మరి
యభ్యసించవలెన్.

స్వీయ జాతీయానుసరణము
నన్య జాతీయముల ధిక్కృతి
నియమమంద్రిది యాత్మకానం
దంబు(గూర్చెడినీ.

లోకవృత్తియె యన్యజాతియు
ఆత్మవృత్తియె స్వీయజాతియు
నియమపూర్వకముగ బుధులు దా
మభ్యసింపవలెన్.

వ్యాఖ్య : యమము అంటే సర్వమూ బ్రహ్మమే అను జ్ఞానంతో ఇంద్రియాలను

అదుపులో ఉంచుకొనటం. పాతంజల యోగ శాస్త్రంలో యమము అంటే, "సత్యము, అహింస, బ్రహ్మ చర్యము, చౌర్యము చేయకుండుట, అపరిగ్రహము (ఇతరుల వస్తువులు తనవి చేసికొనకుండుట, లేదా, అసలు ఏ వస్తువులూ పరిగ్రహించకపోవటం, అని). ఈ యమము మాటిమాటికి అభ్యసించి పాటించాలి. శమదమాది షట్కము ఇందులో భాగాలే. నియమమన()గా స్వజాతీయమైన వృత్తులు అనుసరిస్తూ, విజాతీయములు తిరస్కరించటం. పతంజలి మహర్షి స్వజాతీయాన్ని "శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర శరణాగతి, అని నిర్వచించారు. జ్ఞాన సంపాదన విషయంలో, ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము, - ఇటువంటివి, సజాతీయాలు. వీటికి వ్యతిరిక్తాలు - దేహము, ప్రపంచము, సుఖ దుఃఖాలు, వగైరా -- ఇవి విజాతీయాలు. ఆ సజాతీయాల మీదనే మనస్సునుంచి, నియమం తప్పకుండా అభ్యాసం చేయాలని తాత్పర్యం. ఇంకొక విధంగా స్వధర్మం భగవద్గీతలో చెప్పబడినది. ఈ పుస్తకంలో మూడవ శ్లోకంలో చెప్పిన స్వవర్ణాశ్రమధర్మములూ జ్ఞాన సాధనకు సజాతీయమైన నియమాలుగా చెప్పవచ్చును. బుద్ధిమంతులు వీనిని తప్పక ఆచరించాలి.

**సం. త్యాగః ప్రపంచ రూపస్య చిదాత్మత్వావలోకనాత్**
**త్యాగోహి మహతాం పూజ్యః సద్యో మోక్షమయో యతః 106**

**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ**
**యన్మౌనం యోగిభి ర్గమ్యం తద్భజేత్ సర్వదా బుధః 107**

తే. సచ్చిదాత్మ త్వావలోకన
వలన(గలుగు ప్రపంచ రూప
త్యాగమే త్యాగం బటందురు
సాధనాంగముగన్

మరియు సద్యో మోక్షదాయక
మగుటచే మహితాత్ములకు నీ

త్యాగ మెంతయు పూజనీయ
మ్మంగముల లోనన్

వాఙ్మనస్సులు మరల(బారుట
వలన మూకతనుంట మౌనము
యోగిగమ్యము విబుధభాజ్యము
సర్వ సమయములన్

వాక్కునకు మనసునకు బ్రహ్మము
ప్రాప్తి గనలేకుండు గావున
మరల బారును రెండునుం దమ
చేష్ట లుడుగంగన్

వ్యాఖ్య : ఈ ప్రపంచమంతా ఆత్మ చైతన్యంగా చూస్తూ, అది ఇతరము అనే ద్వైతభావాన్ని త్యజించటమే త్యాగం. ఇది పూజ్య నీయమైనది, మహాత్ముల లక్షణము. తత్క్షణమోక్షదాయకము. ఈశావాస్యోపనిషత్తులో ఈ జగత్తు సర్వమూ పరమాత్మ వ్యాప్తమేననీ, ఆ సత్యాన్ని తెలుసుకుంటే, ఈ జగత్తు పరమాత్మకన్న అన్యమన్న మిథ్యాభావం తొలగి పోతుందనీ చెప్పబడి ఉన్నది. ఆ మిథ్యా జగత్తును వదలి వేయటమే త్యాగం. "త్యాగే నైకో అమృతత్వ మాగతః" (అమృత మయమైన మానసము ఒక్క త్యాగము వలననే కలుగుతుందని) శ్రుతి.

ఎవని వాక్కు, మనస్సు, పరమాత్మను అందుకోలేక వెనుకకు తిరుగుతవో, ఆ నివర్తితమైన మానసము, వాక్కు పాటించే మౌనమే మౌనము. అనగా మాటలాడక (లేక) పోవటమే కాదు, మనస్సు కూడా ఏ ఆలోచనలనూ చేరదీయదు.

అది యోగులకు మాత్రమే లభ్యం. బుధులకు (తెలిసిన సజ్జనులకు) సదా భాజనీయము (ఎల్లప్పుడూ గౌరవీయము, అనుసరింపదగినది). ఇదే విషయము

తైత్తిరీయోపనిషత్తులో గూడా "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసాసహ, ఆనంద బ్రహ్మణో విద్వాన్ న భిభేతి కుతశ్చన" అని ఉన్నది. (ఎవరికైతే వాక్కూ, మనస్సూ అందక, నివర్తితమగుచున్నవో ఆ మౌనమున నున్నవారి ఆనంద రూపబ్రహ్మము తెలిసి, అతడు భయము లేనివాడగును, అని) పైకి వచ్చే వాక్కు వెనుకకు మరలి మాట్లాడక పోవాలి. ఆలోచన మనస్సులోనే లీనమవాలి. అంటే మౌనభావం కూడా ఆత్మ భావమే. అందుచేతనే అది యోగగమ్యం. యోగులు నడవవలసిన దారి.

ఆచార్య రజనీష్ కూడా ఇదే విషయాన్ని చెప్పారు. మనస్సులో ఆలోచనలు ఎప్పుడూ ఆకాశంలో మేఘాల మాదిరి కదులుతూ ఉంటవని, ఎప్పుడు ఆ మేఘాలు లేవో అప్పుడు మనస్సు నిశ్చలమై జిన్‌ను (భగవంతుని) అందుతుందని అన్నారు.

సం. వాచో యస్మా న్నివర్తంతే తద్వక్తుం కేన శక్యతే
ప్రపంచో యది వక్తవ్యః సోఽపి శబ్ద వివర్జితః **108**

ఇతి వా తద్భవే న్మౌనం సతాం సహజ సంజ్ఞితమ్
గిరాం మౌనంతు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః **109**

తే. వాఙ్నివర్తితమైన యాత్మను
శక్యమే వర్ణింపనేరికి?
జగతి వక్తవ్యమును మిథ్యయె
శబ్దవర్జితము

జ్ఞానయోగుల కిట్టి మౌనము
సహజ మాత్మ విలీనమై; య
జ్ఞులకు వాఙ్మౌనము విధించిరి
బ్రహ్మవాదులును

వ్యాఖ్య : వాక్కుకు కూడా చేరటానికి అశక్యమై తిరోధానమైన దంటే ఆ పరమాత్మను వర్ణించటానికి ఎవరి తరం? పోనీ, ప్రపంచాన్ని శబ్దంగా గ్రహించి వర్ణిద్దామంటే, ప్రపంచం మిథ్య గనుక శబ్దము కూడా లేదు. అటువంటి మౌనము – ఆత్మలోనే లయమయే ఆ మౌనము – యోగులకు గమ్యం ఎట్లాగయిందంటే అది వారికి సహజముగా ఆత్మలోనే లీనము. కనుక, వాఙ్మౌనము అజ్ఞానులకొఱకు, ఆరంభకులకొఱకు, బ్రహ్మవాదులు నిర్ణయించారు.

సత్తు, అసత్తూ కానిది శబ్దం. ప్రపంచంగూడా సత్తు, అసత్తు కానిది. వ్యావహారికంగా సత్తు, ఆధ్యాత్మికంగా అసత్తు అని ఇదివరకు చెప్పుకున్నాం. కనుక, శబ్దం కూడా ప్రపంచము వంటిదే, లేక ప్రపంచమే, అని గ్రహించవచ్చు. కాని, జ్ఞానికి ప్రపంచం మిథ్య. కనుక శబ్దం కూడా మిథ్యే. కనుక యోగులకు మౌనం సహజం.

వర్ణములు వాయు ప్రేరితములై సుషుమ్నానాడి వీడి కంఠ తాలువుల తాకిడిచే శబ్దాలౌతవి. యమ నియమములచేత సర్వేంద్రియములను అణచి చిత్తమున బ్రహ్మమును మననము చేయువారికి వాక్యములతో పరబ్రహ్మము ప్రాప్తము కాదని తెలిసి వాక్కులు వెనుకకు మరలి మనస్సులో లీనమౌతవి. మనస్సునకు గూడ పరబ్రహ్మము అగోచరము గనుక అదికూడా అదే విధముగ తిరోధానము చెంది ఆ మననమునే చేయుచుంటవి. అది చేసేవారు మౌనులు.

సం. ఆదా వన్తే చ మధ్యే చ జనో యస్మిన్నవిద్యతే
యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః **110**

కలనా త్సర్వ భూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః
కాలశబ్దేన నిర్దిష్టో హ్యఖండానంద అద్వయః **111**

తె. ఏది సతతము సర్వ విశ్వ
వ్యాప్త మయ్యును నాది మధ్యాం

తములు జనములెఱుంగ రదియే
విజన దేశమ్ము.

బ్రహ్మాది సమస్త భూతము
లను నిమేషాకల్పితాఖం
డాద్వయానందంబె నిర్ది
ష్టంబు కాలమనన్.

వ్యాఖ్య : ఏ ప్రదేశము ఆది, మధ్య, అంతములు లేనిదో, ఏ ప్రదేశములో, ఎచ్చటనూ జనులు ఉండరో, అది "విజన ప్రదేశం". ఐనా, అంతలోనూ ఈ జగత్తు వ్యాప్తమై ఉంటుంది. ఏదీ లేని ఏకాంత ప్రదేశమే విజన ప్రదేశం. అది బ్రహ్మమే. బ్రహ్మాదిగా సర్వ భూతములను ఒక్క నిమేషములో కలనము (సృష్టి) చేయగలుగుటచేత ఆ పరబ్రహ్మమును "కాలము" అని కూడా అంటారు. అతడు అఖండుడు, ఆనంద స్వరూపుడు, అద్వయుడు.

ఇప్పటివఱకు చెప్పిన నాలుగూ, (యమము, నియమము, త్యాగము, మౌనము) మనము ప్రయత్నించి ఆచరించగలము. దేశము, కాలము, ఆత్మ నిర్మితాలు. మన చేతిలో లేవు. ఐనా, వ్యావహారికంగా నైనా, అవి యమ, నియమ, త్యాగ మౌన సాధనలకు ఉపలబ్ధమౌతవి.

సం. సుఖేనైవ భవేద్యస్మిన్నజస్రం బ్రహ్మచిన్తనమ్
ఆసనం తద్విజానీయాన్నేతర త్సుఖనాశనమ్ 112

సిద్ధం యత్సర్వ భూతాది విశ్వాధిష్ఠాన మవ్యయమ్
యస్మిన్ సిద్ధాః సమావిష్టాః తద్వై సిద్ధాసనం విదుః 113

తె. ఎట్టి యాసనమం దజస్రము
బ్రహ్మచింతన సుఖముగా నగు
దాని నాసనమంద్రు - సుఖ నా
శనము లితరములు

సర్వభూత వ్యాప్త విశ్వము
నకు నధిష్ఠానంబు నగుచును
నవ్యయం బగునట్టి బ్రహ్మము
సిద్ధమంద్రు బుధుల్

అట్టి సిద్ధబ్రహ్మమందు స
మాహితంబగు చిత్తముననే
యోగసిద్ధులు నుందురది సి
ద్ధాసనం బనగన్

వ్యాఖ్య : ఏ విధంగా కూర్చుంటే నిత్యమూ, ఆగకుండా,సుఖంగా బ్రహ్మచింతనం చేయటానికి వీలగుతుంతో అది ఆసనం. ఆ ఆసనం ఉండాలి. ఇతర ఆసనాలు సుఖాన్ని నాశనం చేసేవే. వాటి వలన ఏ ప్రయోజనమూ ఉండదు.

సర్వ భూతమయమైన విశ్వానికి అధిష్ఠానమై అవ్యయుడైన పరమాత్మను "సిద్ధము" అంటారు. ఆ సిద్ధబ్రహ్మనే మనస్సులో నిలిపేవారు సిద్ధులు. వారి ఆ ఆసనం సిద్ధాసనం అంటారు.

సం. యన్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్తబంధనమ్
మూలబంధః సదాసేవ్యో యోగోఽసౌ రాజయోగినామ్ 114

అంగానాం సమతాం విద్యాత్ సమే బ్రహ్మణి లీయతే
నో చేన్నైవ సమానత్వం ఋజుత్వం శుష్కవృక్షవత్ 115

తె. చిత్త బంధనమునకు భూత
మ్ములకు మూలము మూలబంధము
యోగ్యమును సేవ్యమ్ము సతతము
రాజయోగులకు

చిత్తమును బ్రహ్మమున లీనము
చేయ నగునది దేహ సామ్యము
వట్టియచలత శుష్క వృక్ష ము
జుత్వ మన(బర(గున్

వ్యాఖ్య : సర్వ భూతాలకూ, చిత్త బంధనకు (అనగా ఏకాగ్రతకు) ఏ ఆత్మ మూలమో, దానిని మూలబంధమంటారు. అది యోగులకు సదా యోగ్యము, ఆచరణీయము. ముఖ్యముగా రాజయోగులకు. సర్వ భూతములకు మూలమైన బ్రహ్మను ఏకాగ్రతతో మననం చేయటమనే రాజయోగం ఆచరిస్తే, లక్ష్యం చేకూరుతుంది. చిత్తమెప్పుడు బ్రహ్మలో లీనమగుతుందో, అప్పుడు శరీరాంగాలన్నీ సమస్థితిలో ఉంటవి. అది దేహ సామ్యము. ఊరకే కదలక కూర్చొనటం చెట్టు మోడులవలె ఉండటం సమత్వం కాదు.

సం. దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యే ద్బ్రహ్మమయం జగత్
సా దృష్టిః పరమోదారా న నాసాగ్రావలోకినీ **116**

ద్రష్టృ దర్శన దృశ్యానాం విరామోయత్ర వా భవేత్
దృష్టి స్తత్రైవ కర్తవ్యా న నాసాగ్రావలోకినీ **117**

తె. జ్ఞానమయమగుదృష్టి జగతిని
బ్రహ్మముగ(జూచుటయె పరమో
దారదృక్స్థితి నాసికాగ్ర వి
లోకనం బగునే?

ద్రష్టృ దర్శన దృశ్య త్రిపుటియు
నెందు లయమగు నట్టి బ్రహ్మనె
దృష్టి నిలుపఁగవలయు నాసా
గ్రముననే కాదు.

వ్యాఖ్య : దృష్టిని జ్ఞానమయం చేసి, ప్రపంచాన్ని బ్రహ్మమయంగా చూడాలి. అదే దృక్ స్థితి. ఊరక (కొన్ని విధులలో చెప్పబడినట్లు) ముక్కు చివర చూడటంకాదు. జ్ఞాన స్వరూపుడైన ఆత్మపై దృష్టి కేంద్రీకరించి చూడాలి. చూపు, చూచేవాడు, చూడబడేది (దృష్టి, ద్రష్ట, దృశ్యము) మధ్య అంతరం ఉండరాదు, అంతా బ్రహ్మ మయమే కనుక. అదే ఆచరించ వలసిన దృక్ స్థితి. అది లభ్యమయ్యేది కేవలం నాసాగ్ర అవలోకనంవలన కాదు.

మనం చూచేది కళ్ళకు ఎదురుగా కనపడుతూ ఉండగా దృష్టి, దృశ్యము,ద్రష్ట, – అంటే చూపు, చూడబడే వస్తువు, చూచేవాడు, _ మూడు ఒకడే ఎట్లా అవగలదు? ఇదంతా అయోమయంగా ఉంది అనుకోవచ్చు. కాని, అనుక్రమం పట్టి చూడాలి. యమము, నియమము, త్యాగము, మౌనము, అలవర్చుకొన్నవారికి ఆత్మ నియమితములైన దేశ, కాల, మూలబంధ, దేహసామ్యాలు అలవడుతవి. అట్లాగే ద్రష్ట, దృష్టి, దృశ్యము, మూడిటిలోనూ ఏకత్వము అనుభవానికి వస్తుంది. ఆ అనుభూతిని దిట్టపరచుకొని ఉండాలి.

సం. చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్
నిరోధం సర్వవృత్తీనాం ప్రాణాయామ స్స ఉచ్యతే **118**

నిషేధనం ప్రపంచస్య, రేచకాఖ్యః సమీరణః
బ్రహ్మై వాస్మీతి యా వృత్తిః పూరకో వాయు రీరితః **119**

తతస్త ద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః
అయం చాపి ప్రబుద్ధానాం అజ్ఞానాం ఘ్రాణపీడనం **120**

తె. చిత్తమాది సమస్తభావము
లందు బ్రహ్మత్వమ్ము గని వృ
త్తుల నిరోధనమె ప్రాణా
యామ మన(బడెడిన్.

ఈ ప్రపంచ నిషేధనము రే
చక; "మహంబ్రహ్మాస్మి"యను న
ద్వైత వాక్యమె పూరకంబను
వాయుపూరకము.

పూర్ణ నిశ్చలవృత్తి కుంభక
ప్రాణ సంయమ మగు విబుధులకు
ఇతర వాయు నిరోధ మజ్ఞుల
ఘ్రాణపీడనము.

వ్యాఖ్య : శంకరుల ప్రకారం ప్రాణాయామమంటే మనోనిగ్రహంతో పాటున్న వాయునిగ్రహం. చిత్తమూ, సమస్త భావాలూ, బ్రహ్మలో లీనం చేయాలి. అప్పుడు ప్రపంచమే గాక మనోవృత్తులన్నీ నిగ్రహింపబడుతవి. అదే ప్రాణాయామం. ప్రపంచాన్ని కాదని గాలి (ముక్కు ద్వారా) విడవటమే రేచనం. "నేనే బ్రహ్మను" అను భావంతో (ముక్కుతో) గాలి పూరించటమే పూరకం. ఆత్మ స్వరూపంలో ప్రాణవాయువు నిశ్చలంగా ఉండటమే కుంభకం. ఇది జ్ఞానుల పద్ధతి. అజ్ఞానులు ముక్కుకు బాధ కలిగించే వాయుపీడనాన్నే ప్రాణాయామ మనుకుంటారు.

పతంజలి యోగశాస్త్రంలోనూ, హఠయోగంలోనూ, ప్రాణాయామం ఒక శారీరక వ్యాయామంగా ఈయబడింది. కుడి ముక్కును మూసుకొని, ఎడమ ముక్కుతో వీలైనంతవరకూ గాలి పీల్చుకోవటం పూరకం. అంటే, ఊపిరి తిత్తులనూ, శరీరాన్నీ, గాలితో పూరించటం. శంకరులు దీన్నే, "నేనే బ్రహ్మను" అన్న భావంతో చిత్తాన్ని

పూరించటమన్నారు. తరువాత రెండు ముక్కులూ మూసుకుని, ఊపిరి బిగబట్టి ఉంచటం కుంభకం. శంకరులు దీనికి ఆత్మనైశ్చల్యాన్ని ఆపాదించారు. తరువాత ఎడమముక్కును మూసుకుని కుడిముక్కుతో మెల్లగా ఊపిరి వదలటం రేచకం. శంకరులు దీనిని ప్రపంచాన్నీ, మానస వృత్తులనూ వదలి వేయటంగా చిత్రించారు.

సం. విషయే ష్వాత్మతా దృష్ట్వా మనస శ్చితి మజ్జనమ్
ప్రత్యాహారః సవిజ్ఞేయోఽభ్యసనీయో ముముక్షుభిః 121

యత్ర యత్ర మనో యాతి బ్రహ్మణస్తత్ర దర్శనాత్
మనసో ధారణం చైవ ధారణాసా పరా మతా 122

తే. విషయముల నాత్మత్వ దృష్టియు
మనసు చిల్లయమగుట ప్రత్యా
హారమగు; నభ్యాస యోగ్యము
మోక్షకాములకు

మనసు ప్రచరించెడి స్థలంబుల
బ్రహ్మమయముగఁజూచి బ్రహ్మము
నందె మనసును నిల్పుటే ధా
రణము నాఁబడును

వ్యాఖ్య : అన్ని విషయములందునూ, తనదైన ఆత్మత్వమును చూడగలిగి, మనస్సును విశ్వచైతన్యంలో లీనం చేయటం ప్రత్యాహారం. ముముక్షువులు ఆ ప్రకారం అభ్యాసం చెయ్యవలసినది. మనస్సు ఎక్కడెక్కడ చరిస్తుందో అక్కడక్కడ బ్రహ్మమునే చూడగలగటం ధారణ. కేవలం ఏకాగ్రత కాదు. సర్వత్ర బ్రహ్మమును చూడటం అంటే బ్రహ్మముననే ఏకాగ్రత నిలుపుకోగలగటం.

సం. బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః
ధ్యాన శబ్దేన విఖ్యాతా పరమానన్ద దాయినీ **123**

నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః
వృత్తి విస్మరణం సమ్యక్ సమాధిర్ జ్ఞానసంజ్ఞకః **124**

తె. నేనె బ్రహ్మము ననెడి సత్యమె
చిత్తవృత్తిగ నగు నిరాలం
బ స్థితియె ధ్యానమ్ము పరమా
నంద దాయకము

నిర్వికారాంతఃకరణ వృ
త్తిని చెలంగుచు నిష్ప్రపంచ
బ్రహ్మ సాకారత్వ చిత్త
వృత్తి(గడ(గ వలెన్

బ్రహ్మ సాకారత(గడంగిన
సర్వవృత్తులు సమయ, నిశ్చల
చిత్తమే సమ్యక్సమాధది
జ్ఞాన సంజ్ఞితము.

వ్యాఖ్య : "నేనె బ్రహ్మను" అన్న సద్వృత్తితో అంటే, సత్యమైన మనోభావంతో, నితరములపై నే యాధారము నుంచుకొనని స్థితి ధ్యానము. అది పరమానంద దాయకము.

ఇతర వికారములు లేక కేవలము బ్రహ్మమునే స్మరించుచు, పిదప ఆ సాకారవృత్తి సమయునప్పుడు నిశ్చల చిత్తమొకటే మిగిలి ధ్యానయుక్తముగా నుండుట సమాధి. అది జ్ఞానమునకు గీటురాయి. అంటే ధ్యానానికి పరాకాష్ఠ సమాధి.

సం. ఏవం చా కృత్రి మానందం తావత్సాధు మ్సమభ్యసేత్
వశ్యో యావత్ క్షణాత్ పుంసః ప్రయుక్తః సంభవేత్ స్వయమ్ 125

తె. ఇది యకృత్రిమమైన పరమా
నంద దాయక మౌ నిదిధ్యా
సనము సొంగంబది ముముక్షువు
లభ్యసింపంగన్.

నిత్య సత్య ప్రకాశంబగు
దీని పరమానంద పరవశ
తానిమజ్జన( గాంచు వరకును
నభ్యసింప(దగున్.

వ్యాఖ్య : ఆ సమాధి స్థితి అకృత్రిమమై, సత్యమైన పరమానందం. సొంగముగా సాధువులచేత తీవ్రముగ నభ్యసించదగినది. ఆ ఆనందములో నాత్మ స్వరూపము ప్రకాశమగును. అట్టి ఆనందము లబ్ధమగువరకు ఈ సాధన నభ్యసింపవలెను. అదే బ్రహ్మ వృత్తి. (తైత్తిరీయములో ఆనందములు వివరింపబడినవి. అవి మానుషానందము, మనుష్య గంధర్వానందము, దేవగంధర్వానందము, పితృ ఆనందము, అజానజ దేవానందము, కర్మదేవానందము, దేవానందము, ఇంద్రానందము, బృహత్యానందము, ప్రజాపత్యానందము, బ్రహ్మానందము. మానుషానందము కృత్రిమము. ఒకదానికొకటి నూరురెట్లుగా చివరకు అఖండమై, అకృత్రిమమైనది బ్రహ్మానందము).

సం. తతః సాధన నిర్ముక్తః సిద్ధోభవతి యోగిరాట్
తత్స్వరూపం న చై స్య విషయో మనసో గిరామ్ 126

తె. అట్లు సాధన వలన నిర్ము
క్తుండు సిద్ధత్వమును పొందిన

యోగి రాజై తానె పూర్ణ
బ్రహ్మమై వెలయున్

అట్టి సిద్ధునిదౌ స్వరూప
స్థితి మనో వాచామగోచర
మాగమాన్త విచార వేద్యము
బ్రహ్మరూపమ్ము

వ్యాఖ్య : ఆవిధముగా పరమానంద లబ్ధి గాంచిన సాధకుడు యోగీశ్వరుడై స్వయంబ్రహ్మ స్వరూపమై, తదుపరి మరి ఇతర సాధనము లేవియు నవసరము లేనివాడై సంపూర్ణుడై వెలయును. అట్టి ఆత్మ స్వరూపము మానసమునకుగాని, వాచ్యమునకు గాని (మాటలకు) అగోచరము. అది కేవలము అనుభవైక వేద్యము. ముండకోపనిషత్తులో కూడ ఇది చెపబడినది. (3 వ ముం. 2 వ ఖండం). అదే అపరోక్షానుభూతి.

ఇంతవఱకు శంకరులు సమాధి స్థితి ఏ విధంగా అలవఱచుకోవలసింది, చెప్పారు. ఇప్పుడు ఆ సాధనలో కలిగే విఘ్నాలేమిటో, అవి ఎట్లా నివారించుకోవాలో చెబుతున్నారు.

సం. సమాధౌ క్రియమాణే తు విఘ్నా ఆయాన్తి వై బలాత్
అనుసంధానరాహిత్య మాలస్యం భోగలాలసమ్ 127

లయస్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా
ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః 128

తే. ఈ సమాధి క్రియకు నెనిమిది
ప్రబల విఘ్నము లొలయు ననుసం
ధానరాహిత్యమ్ము, నలసత,
భోగలాలసయున్

నిద్ర, యజ్ఞత, చంచలత్వము,
సుఖరసాస్వాదనము, శూన్యత
బ్రహ్మవేత్తలు వీని మెలకువ
తోడ వీడవలెన్

్యాఖ్య : ఈ సమాధి స్థితిని సాధన చేసేటప్పుడు అనేక బలవత్తరమైన విఘ్నాలు ంభవిస్తవి. ముఖ్యమైనవి: (1) అనుసంధాన రాహిత్యము (అనగా ఆత్మానాత్మ చక్షణలో స్తిమితత్వము లేకుండుట) (2) అలసత (అనగా బద్ధకము, సోమరితనము) 3) భోగలాలసత్వము, అనగా (శరీర సౌఖ్యాలపై లోలత్వం) (4) లయము (అనగా ద్రమత్తు) (5) తమము (అనగా మనసుసులో చీకటి - మంచితనముపై బుద్ధి ేకుండుట) (6) విక్షేపం (కలవరపాటు, సంశయావేదన) (7) రసాస్వాదన (మంచి ుచుల మీద, సుఖము మీద అభిలాష) (8) శూన్యత (ఏమీ తోచక, మనస్సు ుకలమైన స్థితిలో ఉండటం). సాధకుడు ఇటువంటి విఘ్నాలను ప్రయత్నంమీద ుదిలించుకోవాలి. బుద్ధుడు కూడా తపశ్చర్యకు మారుడు విఘ్నాలు చేస్తాడని ాచ్చరించాడు. పై చెప్పిన గుణాలే మారుని లక్షణాలు.

ుo. భావృత్త్యాహి భావత్వం, శూన్యవృత్త్యా హి శూన్యతా
పూర్ణవృత్త్యా హి పూర్ణత్వం, తథా పూర్ణత్వమభ్యసేత్ 129

యేహి వృత్తిం జహత్యేనాం బ్రహ్మాఖ్యాం పావనీం పరామ్
వృథైవ తేతు జీవన్తి, పశుభిశ్చ సమాః నరా 130

తె. భావవృత్తిని శూన్య వృత్తిని
భావతయు శూన్యతయు లభ్యము
పూర్ణ వృత్తిని దొరకు పూర్ణత
దాని నేర్పవలెన్

పరమ పావనమైన బ్రాహ్మ
వృత్తి విడి జీవించు వారలు
వ్యర్థ జీవులు, పశుసమానులు
జ్ఞాన హీనమతుల్

వ్యాఖ్య : మనస్సులో ఏ భావం ఉత్పత్తి అయితే ఆ భావం ప్రకాశం అవుతుంది. "యద్భావం తద్భవతి" అని ఆర్యోక్తి. మనస్సు శూన్యంగా ఉంటే, శూన్యత్వమే బహిర్గతమవుతుంది. మనస్సు పూర్ణవృత్తితో వుంటే పూర్ణత్వం సంభవిస్తుంది. పూర్ణత్వమంటే సంపూర్ణమైన ఆత్మ విజ్ఞానం కలిగి ఉండటం. అది బ్రహ్మానందదాయకం. అది అలవర్చుకోవాలి. ఈ బ్రాహ్మీ వృత్తి పరమ పావనమైనది. అది లేక జీవించేవారు వ్యర్థజీవులు. (వివేక చూడామణిలో శంకరాచార్యులు, జగత్తులో దుర్లభమైన మూడిటిని - మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయం అని ఉద్ఘాటించారు. మానవునిగా పుట్టటమే గొప్ప. వానికి ముముక్షుకత్వముండాలి. అది లేకపోతే మానవుడు పశువుతో సమానమని ఇప్పుడు పునరుద్ఘాటిస్తున్నారు.)

సం. యేహి వృత్తిం విజానన్తి యే జ్ఞాత్వా వర్ధయన్త్యపి
తే వై సత్పురుషా ధన్యా వన్ద్యాస్తే భువనత్రయే 131

యేషాం వృత్తిః సమా వృద్ధా పరిపక్వాచసా పునః
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే శబ్దవాదినః 132

తె. బ్రహ్మ వృత్తి నెఱింగి చిర మ
భ్యాసమునఁ బెంపొందువారలు
వారె సత్పూరుషులు ధన్యులు
మూఁడు లోకములన్

ఇట్లు బ్రాహ్మీవృత్తిలో పరి
పక్వమౌ పూరుషులు మాత్రమె
బ్రహ్మభావము గాంతు రితరులు
పొల్లు మాటరులే

వ్యాఖ్య : ఈ బ్రాహ్మీ వృత్తి చిరకాలం అభ్యాసం చేసి అలవర్చుకొన్నవారే సత్పురుషులు, ధన్యులు, మూడు లోకాలలోనూ పూజింపబడేవారు. ఈ బ్రహ్మ వృత్తి పెంపొందించి అందులో పరిపక్వమైనవారే నికరంగా బ్రహ్మైక్యం చెంది విశ్వవ్యాప్తంగా బ్రహ్మలో లీనమౌతారు. కేవలం భాష యొక్క ఆడంబరంతో వృత్తి పాటించకుండా ఉపన్యాసాలు చేసేవారు వట్టి శబ్దవాదులే. పొల్లు మాటలవారే కాని, ఉన్నత స్థితి చెందలేరు.

అద్వైతానికీ, విశిష్టాద్వైతానికీ, ఇందులో గమ్యము ఒకటైనా, మార్గములు వేరు. అద్వైతంలో శంకరులు చెప్పినట్లు బ్రాహ్మీవృత్తి సాధన చేస్తే పరమాత్మ స్వరూపంలో ఐక్యమవుతారు. విశిష్టాద్వైతంలో (అంటే వైష్ణవంలో) భక్తిమార్గమే మార్గం. భక్తి ద్వారా విష్ణు సాకారత చెంది, వైకుంఠంలో చతుర్బాహులై కొంతకాలానికి విష్ణువులో ఐక్యం చెందుతారు.

సం. కుశలా బ్రహ్మ వార్తాయాం వృత్తి హీనాః సురాగిణః
త్యేహ్య జ్ఞాని తమా నూనం పునరాయాన్తి యాన్తి చ 133

నిమేషార్ధం న తిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా
యథా తిష్ఠన్తి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకాదయః 134

తే. బ్రహ్మ విషయికమైన వ్యాఖ్యల
వేదచర్చల చేయు బ్రాహ్మీ
వృత్తి లేని మనుష్య లజ్ఞులు
జనన మరణ హతుల్.

బ్రహ్మవృత్తిని లేక నిముషం
బైన నుండరు బ్రహ్మమూర్తులు
సనక శుక ముఖ బ్రహ్మ విజ్ఞుల
చంద మొప్పారన్

వ్యాఖ్య : ఈ బ్రహ్మ విషయిక మైన సాహిత్యం బాగా తెలిసినవారు కొందరు, తెలిసికూడా బ్రహ్మవృత్తిని పట్టించుకోరు. ఉపన్యాసాలు, ప్రవచనాలు, ఇస్తూనే ఉంటారు. కాని, సాంసారిక రాగానుబంధాలతో భోగేచ్ఛలతో నున్న విశేషమైన అజ్ఞానతములు. చచ్చుచు, పుట్టుచు, మరల చర్విత చర్వణులౌతూనే ఉంటారు. కాని, ఆత్మజ్ఞానానుభూతి చెందలేరు.

బ్రహ్మవృత్తి కలవారు, బ్రహ్మమయంగా ఒక్క అరనిముషంకూడా ఉండకుండలేరు. బ్రహ్మ, సనక సనందనాదులు, శుకుడు, మొదలైనవారివలె.

ఇంతవరకు శంకరాచార్యులు అపరోక్షంగా, స్వానుభవంతో, ఆత్మానుభూతి ఏ విధంగా సాధించాలి? అనే విషయం మీద చెప్పారు. ఆత్మే బ్రహ్మము, పరమాత్మ, జగత్కారణము, నిత్యము, అవ్యయము, ఆనందమయము, అని వివరించారు. ఆత్మే చైతన్యం అని గూడా సూచించారు. స్థూలంగా అసలు బ్రహ్మము అనే పదార్థము ఉన్నదా అన్న ప్రశ్న వేసే వారికి ప్రపంచమూ, అందులో ఒక్కొక్క వస్తువూ చూచి, వాటికి (భౌతికము కాని) కారణాలు ఏవి అని ఆలోచిస్తే, అది ఉన్నట్లు తెలుస్తుంది అని చెప్తున్నారు.

సం. కార్యే కారణతా యాతా కారణే న హి కార్యతా
కారణత్వం తతో గచ్ఛేత్ కార్యాభావే విచారతః 135

అథ శుద్ధం భవేద్వస్తు యద్వై వాచామగోచరం
ద్రష్టవ్యం మృద్ఘటేనైవ దృష్టాన్తేన పునః పునః 136

తె. కారణము కార్యమున నుండును
కారణంబున కార్యముండదు
కార్యమే లేకున్న కానము
కారణం బెదియో !

అదియె శుద్ధం బైన వస్తువు
వాక్యముల గోచరము కానిది
మృద్ఘటాద్యుపమానములచే
తెలియ(బడియెడిది

వ్యాఖ్య : కార్యంలో కారణముంటుంది గాని, కారణంలో కార్యముండదు. కార్యభావం లేనప్పుడింకా కారణమెక్కడుంటుంది ? సువర్ణం కారణం ఆభరణానికి. ఆభరణమే లేనప్పుడు సువర్ణత్వ మెక్కడుంది ? అదే విధంగా మట్టి, కుండ, ఉదాహరణ. సువర్ణము, మట్టి, నైసర్గికంగా లేనివి కావు. కార్యం లేనప్పుడే అవి కనుపించవు. సువర్ణత్వము ఉండదు కాని, సువర్ణం ఉండనే ఉంటుంది. అదే విధంగా, కార్యమైన ప్రపంచం లేకపోతే, కారణమేమో తెలియదు. ప్రపంచమూ, అందులోని విషయాలూ చూస్తుంటే కారణమైన బ్రహ్మము తెలుస్తుంది. ప్రపంచానికి ఉపాదాన కారణము బ్రహ్మమేనని 45వ శ్లోకంలో, 66వ శ్లోకంలో, ఇంకా ఇతరత్రానూ, చెప్పబడినది. దీన్ని 138వ శ్లోకంతో కూడా అన్వయించవచ్చు. అదేవిధంగా ఎప్పుడూ శుద్ధంగా ఉండి, మాటలకు తెలియని వస్తువు, శాశ్వతమైనది, బ్రహ్మమే. ఆభరణము, కుండ, మాదిరి వేర్వేరు పేర్లతో ఉండవచ్చును గాని, సర్వత్ర సత్యము, శాశ్వతము, బ్రహ్మమే. ప్రపంచం అసత్యం కనుక, కార్యమైన అది ఉన్నా, లేకున్నా, బ్రహ్మము మాత్రము నిత్యము, సత్యము.

సం. అనేనైవ ప్రకారేణ, వృత్తిర్బ్రహ్మాత్మికా భవేత్
ఉదేతి శుద్ధ చిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరమ్ 137

కారణం వ్యతిరేకేణ పుమానాదౌ విలోకయేత్
అన్వయేన పున స్తద్ధి కార్యే నిత్యం ప్రపశ్యతి 138

తె. ఈ విధంబుగ చింతనంబుల
వృత్తి బ్రహ్మాత్మకత( జెందును
శుద్ధ చిత్తులయందు బ్రహ్మ
జ్ఞాన ముదయించున్

కారణంబును వేరు చేయుచు
కార్యమును చూడంగ చూడగ
కారణంబగు బ్రహ్మ నిత్యము
కార్యమున తో(చున్

వ్యాఖ్య : ఈ ప్రకారమైన మనోవృత్తి, చింతన, ధ్యానాదులచేతనే; ఆ మనోవృత్తి బ్రహ్మాత్మకమైనదవుతుంది. ఆ విధంగా శుద్ధమైన చిత్తం కలిగినప్పుడు బ్రహ్మ వృత్తి జ్ఞానం కలుగుతుంది. అంటే, బ్రహ్మలో సమైక్యమవుతుంది. కార్యంలో నుంచి కారణాన్ని తొలగించి చూస్తే కనపడే కార్యం ఎట్లా కలిగింది అని ప్రశ్న ఉదయిస్తుంది. చూడగా చూడగా, కార్యం అంతటిలోనూ కారణమే కనబడుతుంది. అదే విధంగా కార్యమైన ప్రపంచం చూడగా చూడగా, కారణమైన బ్రహ్మమే కనపడుతుంది.

సం. కార్యేహి కారణం పశ్యేత్ పశ్చాత్కార్యం విసర్జయేత్
కారణత్వం తతో పశ్యే దవశిష్టం భవే న్మునిః 139

భావితం తీవ్ర వేగేన వస్తు య న్నిశ్చయాత్మనా
పుమాంస్తద్ధి భవే చ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ 140

తె. కార్యమున కారణమునుం గని
పిదప కార్యము వదలి వైచిన
కారణత్వము మాయమై స్వీ
యాత్మ యే మిగులున్

తీవ్రదీక్షను నిల్పి వస్తువు
నెది జపించును నిశ్చయుండై
పురుషుఁడా భావమునె చెందును
భ్రమరకీటగతిన్

వ్యాఖ్య : కార్యంలో కారణం (పరమాత్మను) చూచిన పిమ్మట కార్యాన్ని వదిలితే, కారణం మిగులుతుంది. కాని కార్యం లేకుంటే కారణం కనుపించదు కదా! కనుక అది కూడా అగోచరమగుతుంది. ఆ విధంగా కారణాన్ని కూడా విసర్జిస్తే మిగిలేది ఆత్మానుభూతి, ముని అంటే, బ్రహ్మ స్వరూపం - అంటే, ఆత్మస్వరూపం. ఎందుచేతనంటే 126వ శ్లోకంలో చెప్పినట్లు తానే బ్రహ్మము అయినాడు. కనుక పురుషుడు ఏ వస్తువునైనా అత్యంతమైన ఏకాగ్రతతో తీవ్రంగా, నిశ్చయాత్మకతతో చింతన చేస్తాడో, భ్రమర కీట న్యాయానుగుణ్యంగా అతడు ఆ వస్తువే అవుతాడు. (భ్రమరం కీటకం చుట్టూ ఝుమ్మని శబ్దం చేస్తూ తిరుగుతూ వుంటే, దాని మీదే ధ్యానం ఉంచిన ఆ కీటకం గూడా భ్రమరంగానే మారుతుంది. అది భ్రమర కీటకన్యాయం) అదే విధంగా, నిరంతర పరమాత్మైక ఏకాగ్ర చింతన సాధకుణ్ణి పరమాత్మగానే మార్చేస్తుంది. 24 వ శ్లోకంలో చెప్పిన దానికిది వివరణ.

సం. అదృశ్యం భావరూపంచ, సర్వ మేదచ్చిదానందాత్మకః
సావధాన త యానిత్యం స్వాత్మానంభావయేత్ బుధః 141

దృశ్యం హ్య దృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్
విద్వాన్నిత్య సుఖేతిష్ఠేద్ధియా చిద్ర స పూర్ణయా 142

తె. కానుపించని భావరూపము
సర్వ చిత్ జగమంచు విజ్ఞుడు
దాని స్వీయాత్మ స్వరూప మ
టంచు నెంచవలెన్

దృశ్యమెల్లన దృశ్య బ్రహ్మ
మ్మనుచు చింతనఁజేయు విజ్ఞుఁడు
నిత్యశుభముల నందు చిద్రస
పూర్ణ ధీయుతుఁడై

వ్యాఖ్య : బుద్ధిమంతుడైన పురుషుడు జగమునంతా అదృశ్యమైన చైతన్యశక్తిగా గ్రహించి, ఆ జగమంతా తన ఆత్మ స్వరూపమేనని చింతన చేయాలి. అన్ని వస్తువులయందు తన ఆత్మనే దర్శించాలి.

బాహ్యేంద్రియములకు కన్పించే దృశ్యం అంతా, అదృశ్యమైన పరమాత్మ స్వరూపంగానే చింతన చేసి, సర్వము శుద్ధ చిద్రసపూర్ణ, ఆనందమయమైన స్వీయాత్మగానే తెలుసుకొని, విజ్ఞుడు బ్రహ్మానందసుఖానుభూతి చెందుతాడు. ఇది ఫల శ్రుతిగా చెప్పుకోవచ్చు.

సం. ఏ భిరంగైః సమాయుక్తో రాజయోగ ఉదాహృతః
కించిత్ పక్వ కషాయాణాం హఠయోగేన సంయుతః 143

పరిపక్వం మనో ఏషాం కేవలో యంచ సిద్ధిదః
గురు దైవత భక్తానాం సర్వేషాం సుఖ భోజనాత్ 144

తె. పైనుదాహృతమైన దంతయు
రాజయోగంబంగ సహితము

స్వల్పముగ హఠయోగకలితము
జన్మ మృత్యు భయచ్ఛిదమ్

మనసు పరిపక్వమ్ము చెందగ
నిది, ఇదొక్కటె సిద్ధిదంబగు
దైవ గురు భక్తితో నిది
సులభతరమౌను

వ్యాఖ్య : ఈ పైన చెప్పినదంతా రాజయోగం. సాంసారిక వాసనలన్నీ వదలి, నశించిన తర్వాత నభ్యసించే యోగం. కాని, సంసారులకు వాసనా బం తెగుటకు దీనిని కొంత హఠయోగంతో కలిసి చెప్పబడినది. వీనిని అభ చేయాలి. (హఠయోగం అంటే ప్రాణాయామాది శారీరక యమ, నియమ ష యోగాభ్యాసం).

పైన చెప్పిన విధంగా మనసు పరిపక్వమైన వారికే ఈ రాజయోగం సిద్ధిస భగవంతునియెడ, గురువులయెడ, భక్తి శ్రద్ధలతో ఆచరించినచో, ఃసులభసాధ్యమవుతుంది.

# శివాపరాధ క్షమాపణ స్తోత్రము

(శ్రీమత్ శంకరాచార్య విరచితము)

శ్లో. ఆదౌ కర్మప్రసంగాత్ కలయతి కలుషం మాతృకుక్షౌ స్థితం మాం
విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం జాఠరో జాతవేదాః
యద్యద్వై తత్రదుఃఖం వ్యథయతి నితరాం శక్యతే కేన వక్తుం
క్షంతవ్యో మే౽పరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. బాల్యే దుఃఖాతిరేకా న్మలలులితవపుః స్తన్యపానే పిపాసు
ర్నో శక్త శ్చేంద్రియేభ్యో భవ మలజనితా జంతవో మాం తుదంతి
నానారోగాతిదుఃఖా ద్రుదితపరవశః శంకరం న స్మరామి
క్షంతవ్యో మే౽పరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. ప్రౌఢో౽హం యౌవనస్థో విషయవిషధరైః పంచభి ర్మర్మసంధౌ
దష్టో నష్టో వివేక స్సుతధన యువతి స్వాదుసౌఖ్యే నిషణ్ణః
శైవే చింతావిహీనం మమ హృదయమహో మానగర్వాధిరూఢం
క్షంతవ్యో మే౽పరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. వార్ధక్యే చేంద్రియాణాం వికలగతిమత శ్చాధిదైవాదితాపైః
ప్రాప్తై రోగైః ర్వియోగైః వ్యసనకృశతనోః ప్రౌఢిహీనం చ దీనమ్
మిథ్యామోహాభిలాషై ర్భ్రమతి మమ మనో ధూర్జటే ర్ధ్యానశూన్యం.
క్షంతవ్యో మే౽పరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. స్నాత్వా ప్రత్యూషకాలే స్నపనవిధివిధౌ నాహృతం గాంగతోయం
పూజార్థం వా కదాచి ద్బహుతరగహనే౽ఖండ బిల్వీదళం వా
నానీతా పద్మమాలా సరసి వికసితా గంధపుష్పై స్త్వదర్థం
క్షంతవ్యో మే౽పరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

మ. అపరకర్మంబున మాతృగర్భకలుషవ్యాసంగినై తొల్త మూ
త్ర పురీషాద్యపవిత్ర పంకజలమధ్యన్ జాఠరాంగారపుం
దపనన్ వ్రేఁగుచునుంటి నిన్ గొలుచు కృత్యంబం దశక్తుండనై
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. త్రిపురధ్వంసక! శైశవంబున మలోత్కీర్ణాంగినై స్తన్యపా
న పిపా సాదిక జన్మసంజనిత జాంతవ్యప్రలోభస్థితిన్
వపురాక్రాంత రుజాది దుఃఖగతి నిన్ బ్రార్థింపరాకుండె; నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. చపలత్వంబున యౌవనాప్త విషయేచ్ఛా సర్పదష్టుండనై
శిపివిష్టా! మనితిన్ సతీ సుత గృహ స్త్రీసౌఖ్య భోగాదులన్
గృపణత్వంబున నష్టబుద్ధినయి లోకేశా! నినుం గొల్వ, నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. వపువున్ బ్రౌఢియు శక్తియున్ వికలమై వార్ధక్యసంప్రాప్తి, దే
హపుఁ దాపంబున రోగమున్ బలిసి మిథ్యామోహసక్తుండనై
ద్విపచర్మాంబర! యిన్నినాళ్ళు నిను సేవింపన్ విచారింప, నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. విపులాబ్రౌఘమునం దుషోదయమునన్ విధ్యుక్తధర్మంబుగన్
స్నపనం బాడి భవత్పదార్చనకుఁ బూజాపుష్పబిల్వాదులం
గపురం బంబుజమున్ సుగంధకలితార్ఘ్యంబున్ సమర్పింప నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

శ్లో. దుగ్ధై ర్మధ్వాజ్యయుక్తై ర్దధిగుడసహితైః స్నాపితం నైవ లింగం
నో లిప్తం చందనాద్యైః కనకవిరచితైః పూజితం న ప్రసూనైః
ధూపైః కర్పూరదీపై ర్వివిధరసయుతై ర్నైవ భక్ష్యోపహారైః
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. నో శక్యం స్మార్తకర్మ ప్రతిపదగహనే ప్రత్యవాయాకులాఢ్యే
శ్రౌతే వార్తా కథం మే ద్విజకులవిహితే బ్రహ్మమార్గానుసారే
తత్త్వేఽజ్ఞాతే విచారే శ్రవణమననయోః కిం నిదిధ్యాసితవ్యం
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. ధ్యాత్వా చిత్తే శివాఖ్యం ప్రచురతరధనం నైవ దత్తం ద్విజేభ్యో
హవ్యం తే లక్షసంఖ్యై ర్హుతవహవదనే నార్పితం బీజమంత్రైః
నో తప్తం గాంగతీరే వ్రతజపనియమై రుద్రజాప్యం న జప్తం
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. నగ్నో నిస్సంగశుద్ధ స్త్రిగుణవిరహితో ధ్వస్తమోహాంధకారో
నాసాగ్రన్యస్తదృష్టి ర్విదితభవగుణో నైవ దృష్టః కదాచిత్
ఉన్మత్తావస్థయా త్వాం విగతగతమతి శ్శంకరం న స్మరామి
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. స్థిత్వా స్థానే సరోజే ప్రణవమయమరుత్కుంభితే సూక్ష్మమార్గే
శాంతే స్వాంతే ప్రలీనే ప్రకటితవిభవే దివ్యరూపే శివాఖ్యే
లింగాగ్రే బ్రహ్మవాక్యే సకలతనుగతం శంకరం న స్మరామి
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

మ. అపరాహ్ణంబున శైవలింగమును దుగ్ధాజ్యాది పంచామృత
స్నపితంబున్ వరగంధమద్ది, కనకప్రక్ప్రూజల్ సేయఁ, గ
ప్రపు దీపద్యుతి ధూపమిచ్చి యొసఁగన్ భక్ష్యోపహారంబు నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. అపథార్హ్యాకులుఁ డయ్యు స్మార్త బహుకర్మాచారముల్ నేర; నా
కుపలబ్ధం బగునొక్కొ శ్రౌతవిధియుక్తోద్యన్నిదిధ్యాసనా
సుపథధ్యాన నిరంతరశ్రవణ శుశ్రూషావిధుల్ స్వామి! నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. శిపివిష్టార్చనఁ జేసియున్ ద్విజుల నర్చింపన్ ధనోదారతన్
జప హవ్యాదులు బీజమంత్రవిధి లక్షల్ వహ్ని కర్పింప; నే
తపమున్ సల్పను గాంగతీరమున, రుద్రధ్యాతృతల్ నేర్వ నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. అపవర్గాప్తికి నాసికాగ్రమున చూపానించి, నిస్సంగినై
రిపుషట్కమ్ము జయించి నిర్గుణుఁడనౌ రీతిన్ విచారించియున్
చపలావస్థలనష్టబుద్ధి స్మరియించన్ శంకరున్ నిన్ను! నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. త్రిపురారీ! జలజాసనంబుఁ గొని శాంతిన్ దాంతి యొప్పార సూ
క్ష్మపథస్థానిల కుంభిత ప్రణవయుక్త త్ర్యక్షలింగస్వరూ
పపు జ్యోతిన్ గతజన్మలం దయినఁ గొల్వన్నేర నిన్ శంభు, నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

శ్లో. హృద్యం వేదాంతవేద్యం హృదయసరసిజే దీప్త ముద్యత్ప్రకాశం
సత్యం శాంతస్వరూపం సకలమునిమనః పద్మషండైక వేద్యమ్
జాగ్రత్స్వప్నే సుషుప్తౌ త్రిగుణవిరహితం శంకరం న స్మరామి
క్షంతవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః శ్రీ మహాదేవ శంభో!

శ్లో. చంద్రోద్భాసితశేఖరే స్మరహరే గంగాధరే శంకరే
సర్పై ర్భూషిత కంఠకర్ణవివరే నేత్రోత్థవైశ్వానరే
దంతిత్వక్కృత సుందరాంబరధరే త్రైలోక్యసారే హరే
మోక్షార్థం కురు చిత్త వృత్తి మమలా మన్యైస్తు కిం కర్మభిః

శ్లో. కిం యానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం
కింవా పుత్రకళత్రమిత్రపశుభి ర్దేహేన గేహేన కిమ్
జ్ఞాత్వైతత్క్షణభంగురం సపది రే త్యాజ్యం మనో దూరతః
స్వాత్మార్థం గురువాక్యతో భజ భజ శ్రీపార్వతీవల్లభమ్

శ్లో. పౌరోహిత్యం రజనిచరితం గ్రామణీత్వం నియోగో
మాఠాపత్యం హ్యనృతవచనం సాక్షివాదః పరాన్నమ్
బ్రహ్మద్వేషః ఖలజనరతిః ప్రాణినాం నిర్దయత్వం
మా భూదేవం మమ పశుపతే జన్మజన్మాంతరేషు

శ్లో. ఆయు ర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం
ప్రత్యాయాంతి గతాః పున ర్న దివసాః కాలో జగద్భక్షకః
లక్ష్మీ స్తోయతరంగభంగచపలా విద్యుచ్చలం జీవితం
తస్మా న్మాం శరణాగతం కరుణయా త్వం రక్ష రక్షాధునా!

మ. అపరబ్రహ్మము హృత్సరోజవిధృతోద్యద్వేద వేదాంత వే
ద్యపునీతంబును సత్య శాంతము నవస్థాతీతమున్ నిర్గుణా
త్మ పదాలంబిత చిత్స్వరూపమగు నిన్ ధ్యానింపలేకుంటి, నా
యపరాధంబు క్షమింపు మో హర! విరూపాక్షా! శివా! శంకరా!

మ. చంద్రోద్భాసితశేఖరున్ స్మరహరున్ స్వర్వాహినీ సంకులత్
సాంద్రాభీలజటాధరున్ విషధరోద్యద్భూషణాలంకృతున్
చంద్రార్కానలదివ్యనేత్రు గజరాట్చర్మాంబరున్ విశ్వహృత్
కేంద్రున్ నిర్మల చిత్తవృత్తిఁ గను, ముక్తిప్రాప్తి కేలా విధుల్?

మ. అవని గజాశ్వవాహన ధనాద్యము లేటికి? రాజ్యమేటికిన్
భవన కళత్ర పుత్త్ర పశు బాంధవు లేటికి? దేహమేటికిన్
అవి క్షణభంగురంబు, లరు లంచు నెఱింగి త్యజించి సద్గురు
ప్రవచనవృత్తి నో మనస! స్వాత్మ భజింపుము పార్వతీపతిన్

మ. పౌరోహిత్యము రాత్రిదోషము వృథాపత్యం బసత్యంబు సా
క్ష్యారిష్టప్రథ గ్రామణీత్వమును బ్రహ్మద్వేష సంభావనం
గ్రూరత్వంబు, పరాన్నభుక్తి, ఖలసందోహానుబంధంబులున్
గౌరీవల్లభ! జన్మజన్మలకు నైనన్ వద్దు వద్దీశ్వరా!

మ. ఆయుఃక్షీణము యౌవనచ్యుతియుఁ బ్రత్యక్షంబు నానాఁటికిన్
పాయంబాఱు దినంబు రాదిఁక జగద్భక్షాధ్యమౌ కాలమున్
శ్రీయుం దోయతరంగభంగచపలాస్తిత్వంబు విద్యుద్ఘృణి
ప్రాయంబైనది జీవితంబు, కరుణన్ రక్షింపు రక్షాత్మకా!



ఆకారాదిక్షకారాన్త వర్ణావయవశాలినీ
వీణా పుస్తక హస్తా ఽ వ్యాత్త్రణోదేవీ సరస్వ

యా వర్ణవదవాక్యార్థ గద్యపద్య స్వరూపిణో
వాచి నర్తయతు క్షిప్రం మేధాం దేవీ సరస్వ